Telugu Classic Popular Edition Series

శ్రీమత్

# ఆంధ్రమహాభారతము

## ఉద్యోగ పర్వము

(తిక్కన ప్రణీతము)

పరిష్కర్త:
శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రి




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - హైదరాబాదు - 4

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావు గారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి తెలుగు భాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలె నని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వ గ్రంథసముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈ లోటును తీర్చి ప్రాచీన గ్రంథ సంచయమును విడి విడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమి ఒక ప్రణాళికను సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన; రెండవది మహాభారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట; పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతిగ్రంథములో గ్రంథకర్తను గూర్చి, గ్రంథప్రాశస్త్యమునుగూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలె నని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీన ప్రబంధాల ప్రకటనము పూర్తియైనది. సంక్షిప్త గ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్రమహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే మహాభారత సంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది.

ఆంధ్రమహాభారత సంపుటములలో అయిదవదైన ఉద్యోగపర్వమును పరిష్కరించి, పీఠిక వెలయించి మాకందజేసిన శ్రీ గడియారం వేంకటశేష శాస్త్రిగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనబడిన గ్రంథసంపుటాల వ్రాతప్రతులను సిద్ధముచేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమికి యిచ్చుటకు

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావు గారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి తెలుగు భాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలె నని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వ గ్రంథసముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈ లోటును తీర్చి ప్రాచీన గ్రంథ సంచయమును విడి విడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమి ఒక ప్రణాళికను సిద్ధము చేసి నది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన; రెండవది మహా భారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట; పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతిగ్రంథములో గ్రంథకర్తను గూర్చి, గ్రంథప్రాశస్త్యమునుగూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలె నని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీన ప్రబంధాల ప్రకటనము పూర్తి యైనది. సంక్షిప్త గ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్రమహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే మహాభారత సంపుటముల పరిష్కారము నిర్వహింపబడు చున్నది.

ఆంధ్రమహాభారత సంపుటములలో అయిదవదైన ఉద్యోగపర్వమును పరిష్కరించి, పీఠిక వెలయించి మాకందజేసిన శ్రీ గడియారం వేంకటశేష శాస్త్రిగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనబడిన గ్రంథసంపుటాల వ్రాతప్రతులను సిద్ధముచేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమికి యిచ్చుటకు

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, వాగ్దానము గావించి అందులో చాలమట్టుకు డబ్బును విడుదలకూడ చేసినవి. అందుకు అకాడమి పక్షాన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహా భారత సంపుటముల నన్నింటిని సిద్ధము చేసి, ఆంధ్రపాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు,
26-2-1971.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి.

# విషయసూచిక

## ఉద్యోగపర్వము - ప్రథమాశ్వాసము

సంఖ్య. పుట.



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

(శ్రీ)

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగ పర్వము

## పీఠిక

శ్రీమద్భారతము – "ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి, యష్టాదశపర్వనిర్వహణసంభృత మై" పెనుపొందినది. అందు– "ఆది దొడంగి మూఁడుకృతు లంధ్రకవిత్వ విశారదుండు, విద్యాదయితుండు, మహితాత్ముఁడు నన్నయభట్టు" తెలుంగు చేసెను. "హృదయాహ్లాది, చతుర్థ, మూర్జిత కథోపేతంబు, నానారసాభ్యుదయోల్లాసి, విరాటపర్వ – మట యుద్యోగాదులుం గూడఁగాఁ బదియేనింటిని" తిక్కన సోమయాజిగారు తెనిఁగించిరి. తత్కృతమగు పదియేనింటిలో మొదటిది విరాటపర్వము. రెండవది యుద్యోగపర్వము. విరాటపర్వ మిట్టి దని తిక్కన సోమయాజి గారు వివరించిరి. ఉద్యోగపర్వ మిట్టి దని మన మిప్పుడు తెలిసికొందుము.

విరాట పర్వమునుగూర్చి "హృదయాహ్లాది, ఊర్జితకథోపేతంబు, నానారసాభ్యుదయోల్లాసి" ఇత్యాదిగాఁ జెప్పిన తిక్కనగా రుద్యోగ పర్వమును గూర్చి యొక్కమాటైనఁ జెప్పలేదు. 'పదియేనింటి' నన్నపుడు ఆ విశేషణము లన్నియు నన్నిపర్వముల కన్వయింపఁజేసెనా యన్న నట్లు గాదు. 'విరాటపర్వ' మని ఆ యొక్కదానికే యన్వయింపఁజేసెను. అందలి యేకవచన ప్రయోగముగూడ నా భావమునే బలపఱచుచున్నది. కావునఁ 'జతుర్థ' మనునదికూడఁ బై విశేషణములతోఁబాటు విరాటపర్వమునకే యన్వయించును. ఉద్యోగపర్వము భారత పర్వములలో నైదవదియు, తాను రచించువానిలో రెండవదియు నగుట స్పష్టము. ఎటుచూచినను ఉద్యోగపర్వమునుగూర్చి యేమియుఁ జెప్పలే దనుట ఫలితాంశము. ఒకవేళ నిట్లూహించిన సరిపోవునేమో! 'భారతపర్వములలో నైదవదియు, స్వరచిత పర్వములలో రెండవదియు' నగుటచే రెండు నిశ్చలయుక్తిఁ జేర్చి, పని

టిని గెల్చి" రచించెనని. ఆ మాట చమత్కారజనకముగా నుండవచ్చును గాని యథార్థము గాదు. ఉద్యోగ పర్వమునుగూర్చి తిక్కనగా రెచ్చటను జెప్పికొనలేదు. దానినిగూర్చియే మన మిప్పుడు తెలిసికొందము.

[తిక్కనగారి వంశాదికమునుగూర్చి గూడ నింతయే. విరాట పర్వమునఁ జెప్పినదానికంటె నెక్కువగా నేమియు లేదు అచ్చటఁగూడ సూచనామాత్రముగనే చెప్పెను. నిర్వచనోత్తర రామాయణమునగూడ నంతయే "గుంటూరు విభుడును, గౌతమగోత్రుండును, అన్నమాంబా కొమ్మనామాత్యుల పుత్రుండును, అగు తిక్కశర్మగారీ కృతికర్త. యజ్ఞము చేసి సోమయాజి యగుట క్రమవిధిప్రాప్తము! 'కవిబ్రహ్మ' 'ఉభయ కవిమిత్రుఁ' డగుట యాతని ప్రతిభావిలసితము. "అమలోదాత్తమనీష నేనుభయకావ్య ప్రౌఢిఁ బాటించు శిల్పమునన్ బారగుఁడన్, గళావిదుఁడ" నని చెప్పికొన్నది యాయన యౌవనోద్భాసితము. మఱియు, నిర్వచనోత్తర రామాయణము నాఁటిదే గాని భారతమునాఁటిది గాదు. భారతము వాని యన్నిటికంటె నుదాత్తమైనది. కవితాపరిపాకములోఁ గావ్యశిల్పములో ననన్యసామాన్య మైనది. అందును, ఈ యుద్యోగపర్వరచన "పరితో లౌకిక వైదికోన్మథన సంభావానుభావ్య"మైనది కనుక, తెలిసిన వంశాదికములోఁ దృప్తిపడి, తెలియవలసిన రచనా విధానమున కుపక్రమింతము.]

ఉద్యోగపర్వము సంస్కృత భారతమున నున్నది. తత్కర్త శ్రీ వేద వ్యాసమహర్షి. అతఁడు మహామనీషి. సంస్కృతమున నాతఁడు వ్రాసి పెట్టి నన్ని గ్రంథములు మఱెవ్వరును వ్రాయలే దని ప్రతీతి. అష్టాదశ పురాణము లుపపురాణాదికములతో నాతని రచన దిగంతవిశ్రాంత మైనది. "యదిహాస్తి - తదన్యత్ర, య న్నేహాస్తి న తత్క్వచిత్" అని భారతమునుగూర్చి యాభాణకమును వినఁబడును. సంస్కృతభారతమున నుద్యోగపర్వమున కనువాదమే యీ యుద్యోగపర్వము. ఈ పర్వమునఁ గథాప్రసక్తి చాలఁ గొంచెముగా గోచరించును. అభిమన్యువివాహానంతరము శ్రీకృష్ణుఁ డాదిగా బంధువు లందఱు కలిసి మాటలాడి, ద్రుపదపురోహితుని హస్తినాపురమున కంపుటయు, దానికిఁ బ్రతిగా ధృతరాష్ట్రుఁడు సంజయుని బాండవులకడ కంపుటయుఁ, దర్వాత శ్రీకృష్ణునిరాయబారము, తర్వాత యుద్ధసన్నాహము - ఇత్యాదిగా సమరోద్యోగసన్నాహమే యిందుఁ జెప్పఁబడినది.

ఇది తెలుఁగున దాదాపుగాఁ బదునైదునూర్ల యఱువది పద్యములు. తిక్కనగారి దృష్టితో - మూలాధారము లేని స్వతంత్రరచన యైనదో - ఈ నిడివి గూడ చాలఁ బొడవైనట్లు తోఁచును. కాని మూలము పరికించితిమేని తెలుఁగులోఁ గలము నెంతగా బిగఁబట్టి కుదించి నడిపెనో వ్యక్తమగును.

సంస్కృత భారతమున గ్రంథభాగములు పాఠభేదములు మిక్కిలిగా నుండును. అయినను, ఈ యుద్యోగపర్వము రమారమి యాఱువేల యాఱునూర్ల యరువది శ్లోకములు కలదిగా సంస్కృతమున గనుపట్టును. దీనిని దెలుఁగు చేయుటలోఁ బదునైదునూర్ల యఱువది పద్యములకు దిగినది. అనఁగా మూడువంతులు త్రోసివేసి, నాలుగున కొకటిగా సంతరించునట్లు కనబడును. ఐనను, కథాగమనము కుంటువడకుండ నడచుట యిందలి విశేషము. మూలమున నూట తొంబదియేడు సర్గలతో మహోహారమువలె నున్న యుద్యోగపర్వమును విభాగించి. మొదటినుండి సంజయు రాయబారము ముగియువరకుఁ బ్రథమాశ్వాసము, సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ దన రాయబారమును గూర్చి చెప్పుటయు, ధృతరాష్ట్రుఁడు విదురాదులతో ముచ్చటించుటయు - ద్వితీయాశ్వాసము, కృష్ణుని రాయబారము తృతీయాశ్వాసము,కృష్ణుఁడు రాయబారము ముగించుకొని వచ్చి ధర్మరాజాదులతోఁ జెప్పి యుద్ధసన్నాహములు చేయుట, చతుర్థాశ్వాసము - ఇత్యాదిగా సమకూర్పఁబడినది.

వరుసగా ముప్పది సర్గలతోఁ దొమ్మిదినూర్ల ముప్పై శ్లోకములకుఁ - బ్రథమాశ్వాసము - మూడునూర్ల యెనుబదియైదు పద్యములుగను - తరువాత నలుబది సర్గలతో - పదునైదునూర్ల తొంబది శ్లోకములకు - ద్వితీయాశ్వాసము - మూడువందల ముప్పైనాల్గు పద్యములుగ, తరువాత నఱువది సర్గలతో - పదునెనిమిదినూర్ల డెబ్బది శ్లోకములకు, తృతీయాశ్వాసము - నాల్గునూర్ల పదునైదు పద్యములుగను, తరువాత అరువదియేడు సర్గలతో రెండువేల రెండునూర్ల డెబ్బది శ్లోకములకు, చతుర్థాశ్వాసము - నాలుగు వందల యిరవై యెనిమిది పద్యములుగను సంతరింపఁ బడినవి.

విరాటపర్వమున డెబ్బదిరెండుసర్గలకు - పదునారునూర్ల యిరువది యారు పద్యములు చెప్పిన తిక్కనగారు - సంస్కృతమున నూటతొంబది

యేడు సర్గలకు - పదునైదువందల యరువది పద్యములు చెప్పి ముగించుట మిక్కిలి యబ్బురము. అనువాదము చేయుటలో ననుభవము పెరుగుట దీనికిఁ గారణము గావచ్చును. అప్రస్తుతములైన యంశములు దీనిలోఁ బెక్కు లుండుటయుఁ గావచ్చును. ఏమైనను, గథాంశములను విశదముగాఁ బ్రస్ఫుటముగా ననపేక్షితవిస్తరముగాఁ జెప్పుట యిందుఁ గొనియాడఁదగినది.

అనువాదప్రారంభమున, మూలమున 'విశ్రమ్య రాత్రా వుషసి ప్రతీతా స్స్నాత్వా విరాటస్య తతోఽభిజగ్ముః' అన్నదానికి, "మనుజపతి యన్వయంబు పావనముజేసి దినచతుష్టయానంతరమునఁ బ్రియమున''అని తెలుఁగు జేసెను. తెలుఁగువారి యింటిపెండ్లి నాలుగు దినములు జరుగుట నాఁటియాచారము గదా!'సభాతు సా మత్స్య పతే స్సమృద్ధా...గ్రహై రివద్యౌర్విమలై రుపేతా' అని యాఱేడు శ్లోకములతో నున్నదానిని, - "ధర్మతనయుండు తమ్ములుం బరివేష్టించియుండ, విశాలరమణీయం బగు కొలువుకూటంబున కరిగి'' యని యొకవచనముతో దాటించెను. మూలమున "పిత్రాసమం రామజనార్ద నౌ చ, ఉపావిశన్ద్రౌపదేయాః కుమారాః'' ఇత్యాదిగా నున్నదానిని వదలి "విరటుఁడును బాంచాలుండును హరియును రాముండు, వారియను జతనూజుల్, పరిణయసమాగతాఖిలధరణీశులు'' నని వారినందరి నొక కందమున గట్టివేసెను. అవసరౌచిత్యములఁ బాటించుటలోఁ దిక్కనగారి జాగరూకత యట్టిది.

బలరాముని మాటలను సాత్యకి తిరస్కరించు ఘట్టమున-"యమౌచ దృఢధన్వానౌ యమకాలోపమద్యుతీ....గదప్రద్యుమ్నసాంబాం శ్చ కాల వజ్రానలోపమాన్'' అని అయిదాఱుశ్లోకములతో నిండుగా నున్నదానిని- కవలవారు, కొడుకుగమియుఁ బాంచాలవర్గంబు వృష్ణివరులు కడఁగిరేని" యని నాదునిర్దేశము సాంకేతికముగాఁ జేసి విడిచెను. మూలముననొకసర్గకుఁ బైగా నున్న ద్రుపదుని సన్నాహమంతయు "ద్రుపదవిభుఁడు నాయితం బయ్యె''నని మూడునాల్గు పద్యములతోడను, అట్లే, "పురోధా వృత్తసం పన్నః.... కౌరవాన్ ప్రతిజగ్మివాన్"అని యించుమించు సర్గతోఁగూడిన యంశము నేడెనిమిది పద్యములతోడను జెప్పి ముగించెను. శల్యుఁడు ధర్మ రాజుతో ముచ్చటించు సందర్భమున నెన్మిదవ యధ్యాయమునుండి పదు

నేడవ యధ్యాయమువరకు విస్తృతమైన యంశమును మూడువందలయేఁబదికిఁ బైగా నున్నదానిని తొంబది పద్యములతో ముగించెను. ఈ పద్యములలో 'అప్పుడు' 'అయ్యవసరమున' ఇత్యాదిగాఁ బదివచనములు నక్షత్రముల వలె వెలుఁగొందుట మఱువరానిది. గ్రంథభారము తగ్గించుటలో నిదియొక తీరు.

ఉభయపక్షసేనాసన్నాహము మూలమున ముప్పదిరెండు శ్లోకములు-అనువాదమునఁ బదిపద్యములు. కాని, "సకలారాతిభయంకరుం డగుచు" ఇత్యాదిగా తెలుఁగులోనున్న సాత్యకిప్రవేశము సంస్కృతమున లేదు. కౌరవ సభలో భీష్ముఁడు కర్ణు నుద్దేశించి 'నచే దేవం కరిష్యామో యదయంబ్రాహ్మణోఽబ్రవీత్।ధ్రువం యుధి హతాస్తేన భక్షయిష్యామ పాంసుకాన్'–అన్న మాట లనువాదమునఁ గన్పట్టవు. "అర్జునుం।డొక్కఁడె యార్వురన మనల నుగ్రరణంబున గెల్చె మొన్న' అని యథాశ్రుతముగా దర్శన మిచ్చినది. ధృతరాష్ట్రుఁడు సంజయుతో జెప్పుమాటలు మూలమున నున్నవి గాని, తెలుగున నున్నట్లు "సంజయునితో నిట్లనియె" "అనిచెప్పి చుట్టునున్నవారితో నిట్లనియె" "అని పలికి వెండియు" "అని పలికి సంజయునిదిక్కు మొగంబై" ఇత్యాదిగా సంజయునే గాక చుట్టునున్న వారినిగూడఁ జూచి పలుకరించు శిల్పము తిక్కనకే దక్కిన దనవలెను. మూలమున నిది మృగ్యము. కాని, మూలమున నిది మృగ్యము. కాని మూలమున– "జనార్దనం చాపి సమేత్య తాత మనోమాత్రం వీర్యవతా ముదారం।.... విద్వాంశ్చైషాం కర్మణి నిత్యయుక్తః" అని విస్తారముగా నున్నదాని ననువాదమునఁ దడవలేదు. తడవకుండుటయే యుక్త మని పాఠకు లనుకోవలెను.

సంజయురాయబారము మూలమునఁ దొమ్మిది సర్గలు – రెండు వందలయేఁబది శ్లోకములు. అనువాదమున నూటపదునాల్గు పద్యములు మూలానువాదములు రెండును సమానముగా నడచినట్లున్నవి. కాని మూలమునఁ జెప్పినవన్నియు శాంతిప్రధానవాక్యములు. రెండు పక్షముల బలములు నజేయములన్నట్లుగా నున్నవి. కాని అనువాదమున నట్లు లేవు. ధర్మరాజు– "మును మమ్ముఁ బొగడి, పదపది। యని వారల గెలుచు టరిది' యని పొత్తునఁ జెప్పిన మాటకు నే నొడఁబడ"– నని కచ్చితముగా నాడిన మాటకు బదులు లేదు. "నన్ను దూరం దలంచితేని నాచేయునది 'ధర్మం-

ఇత్యాదిగా నున్న కొన్ని శ్లోకములగుంపు తీసికొని, వానిని యథేష్టముగా విదిలించి యభిమతముల నేరికొని, ఒక వచనముతో "ప్రియవాదు లెందును గలరు. అప్రియం బగుఁగా కేమి యని పథ్యంబు పలుకువారులేదు. జూదంబు నప్పుడే నడ్డపడి యప్రియంబులకు శంకింపక పథ్యంబు పలికితి. రోగికిఁ బథ్యాహారంబు తలకంటగించునట్లయ్యె. ఐన నిప్పుడుం జెప్పెద వినుము : కాకంబులం గైకొని మయూరంబులన్ బరిహరించు విధంబున........సుయోధనాదులఁ బట్టి యుధిష్ఠిరప్రముఖుల విడిచితివి. నేఁడు కార్యంబు ముట్టవచ్చినం దోపక మిడుంగురు సోకినట్లు తల్లడించెదవు?" అని యథేష్టవ్యాపారము నడపెను. మఱియు "త్యజేదేకంకులస్యార్థే, గ్రామస్యార్థే కులం త్యజేత్ । గ్రామం జనపదస్యార్థే, హ్యాత్మార్థం పృథివీం త్యజేత్" అని మూలమున ధర్మపాఠ మాత్రముగా నున్నదానిని తీసికొని "కులంబు నట్టి యొకని దొలంగుటయ నీతి యని పెద్దలు సెప్పుదురు. దుర్ణయపరుం డై సద్బుద్ధి వినండేని మనము దుర్యోధనుఁ దొలంగిన నేమగు? నది యట్లుండె" నని ప్రశ్నార్థకంబుగా విడిచి — "ఇది యెంత యొప్పునో విచారించు" మని ధృతరాష్ట్రుని మోముపైవు ఎగాదిగ చూచుచున్నట్లుగా చెప్పెను. ఈ విన్యాసము మిక్కిలి అపురూపమైనది.

సంవిధానవైచిత్రి గల మఱియొక సన్నివేశ మిది : ఉపప్లావ్యము నుంచి వచ్చిన సంజయుఁడు కౌరవసభలోఁ దనమాటలు వివరించునపుడు మూలమున మొదట నర్జునుఁడు, తర్వాతఁ దక్కినవారును పలికినట్లుగాఁ పంన్రెండు సర్గలు అయిదువందల శ్లోకములు కడచినవి. తర్వాత ధృతరాష్ట్రుఁడు "యదబ్రూతాం మహాత్మానౌ వాసుదేవ ధనంజయౌ" అని యడుగగా, సంజయుఁడు—"ధనుర్గుణకిణాంగేన పాణినా శుభలక్షణం । పాదమానమయన్ పార్థః కేశవం సమచోదయత్ । ఇంద్రకేతు రివోత్థాయ సర్వాభరణభూషితః । ఇంద్రవీర్యోపమః కృష్ణ స్సంవిష్టో మా మభాషత" అని చెప్పినట్లున్నది. ఇది మూలము. అనువాదమున నిట్లు లేదు. సంజయుఁడు కౌరవసభలో తాను పోయివచ్చిన కథ యంతయు సంగ్రహముగా నొక చిన్న వచనమునఁ జెప్పి, "ఏ నుపప్లావ్యపురమున కేగి తొలుత వాసుదేవార్జునులం గంటి" నని చెప్పెను. ధృతరాష్ట్రుఁడు "అవ్వాసుదేవు చిత్తం బెట్లు? ఏమనియె" నని యడుగగా సంజయుఁడు — "సత్యభామయు ద్రౌపదియు

నరుఁడు చేరియుండఁగాఁ, గుమారు లెవ్వరు లేనిచోటఁ దన్నుం బిలిపింపఁగాఁ దాను బోయి చూచితి ననియు, "ఈ యిరువురు పంచినపని చేయుదురకొ ! ధర్మజునకుఁ జేయరాని తలం పెయ్యది?" అని యనుకొనుచుఁ బోయిన కార్యము విన్నవించితి ననియు, "విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు చెప్పం దొడంగిన వారించి వారిజోదరుం డిట్లనియె" ననియు ననువాదము చెప్పెను. మూలమునఁ బంద్రెండు సర్గలతరువాత వచ్చినకథను, కొందఱు పాత్రలు మాటలాడినతర్వాత వచ్చినదానిని అనువాదమున మొదటనే చెప్పుటయు, అర్జునుఁడు కోరగాఁ గృష్ణుఁడు మాటలాడుటను మార్చి, అర్జునుని వారించి కృష్ణుఁడు పలికెనని చెప్పుటయు ఇచ్చటఁ బరమస్వతంత్రముగా నగుపడును. ఇది సందర్భసన్నివేశౌచిత్యములతో తిక్కనతీర్చినతీర్పు. ఇంత చెప్పినతరువాతఁగూడ, మూలమున నున్న "గాండీవ ధన్వాలోహితః పద్మనేత్రః" అన్నదానిని మఱచిపోక, "కెందామరలఁ దెగడెడుకన్నుల। నరుణచ్ఛవి నెఱయ నిట్టులనె"నని యర్జునునికోపారుణారవిందపత్రనేత్రముల నట్లే యుల్లేఖించుట విశేషములలో విశేషము.

మూలము నన్యథాకరించు వేరొక సన్నివేశ మిది: ధృతరాష్ట్రుఁడు "... కిమసౌ రాజా ధర్మపుత్రోఽభ్యభాషత"అని సంజయునడిగెను. అపుడు– "తత్రానిమిత్తతో దైవాత్సూతం కశ్మల మావిశత్।తదా చ చక్షే విదురః సభాయాం కురు సంసది।సంజయోఽయం మహారాజ మూర్ఛితః పతితో భువి। వాచం నసృజతే కాంచి ద్ధీనప్రజ్ఞోల్పచేతనః" అని, మాటలులేక క్రిందపడిపోయె నని విదురుఁడు చెప్పెను. మూల మిట్లు చెప్పఁగా, ననువాదమున– "సంజయుండు వెచ్చనూర్చి ఱిచ్చవడి మూర్ఛపోయిన చందంబున డెందంబు మగుడఁ జేష్టలు దక్కియుండి, కొండొకసేవునకుఁ జిత్తం బొక్కింతచేసికొని "అక్కటా! యీ భూపాలకుం డింత బేల యగునే" ఇత్యాదిగాఁ దలపోసినట్లు చెప్పఁబడినది. ఒకవేళ నిజముగా నట్లుమూర్ఛపోయినను, ఆస్థితిని మార్చి, సంజయునిపాత్ర కున్మేషముగా ధృతరాష్ట్రునిబేలతనము సూచించు నీ సన్నివేశము తిక్కనగారు తీర్చినదే యనవలెను. ఇట్లే విదురుఁడు చెప్పు ఘట్టమున, మూలమున "ఇహ నిశ్రేయసం ప్రాహు ర్వృద్ధా నిశ్చిత దర్శినః। ....అంకే కురుష్వ రాజానం ధృతరాష్ట్ర! యుధిష్ఠిరం" ఇత్యాదిగా నలువదియైదు శ్లోకములు చెప్పినవిషయమును, శాకునికాదిప్రస్తావన మంతయు విడి

లించి, 'విదురుం డిట్లనియె, మనవారు మున్న దుర్బలులు. పాండవులఁ బిలువఁబంచి తగవునడపుటదక్క మనకుం జేయందగుపని వేఱొండు గలుగునే' యని యొక చిన్నవచనముతో ననువదించి వన్నె వెలమించెను.

మూలము నతిక్రమించి చెప్పిన మఱియొకఘట్ట మిది: మూలమున – 'మమాపి చ మతి స్సౌమ్య భవత్యేవం యథాత్థ మాం॥సాతుబుద్ధిః కృతాప్యేదం పాండవాన్ ప్రతి మే సదా।దుర్యోధనం సమాసాద్య పునర్విపరివర్తతే। ....దిష్ట మేవ ధ్రువం మన్యే పౌరుషం తు నిరర్థకం' – అని యున్నది. అనువాదమున – "అంబికేయుం డిట్లను – నీదు పలుకులఁ, గలఁకదేఱి బుద్ధి తెలివినొందె, ఇట్లు చేయువాఁడ, నిదియ కర్జము, ధర్మమును, యశంబు, లాభమును దలంప" అని ధృతరాష్ట్రుఁడు చెప్పఁగా, విదురుఁడు 'అనుఁడు, ముదంబు – నమ్మమియు నాత్మఁ బెనంగొన, నన్నతోడ ని।ట్లను విదురుండు: పెద్దవడి కక్కడ! నీమది కార్యవృత్తి నూల్కొనియె; సుయోధనుం గని యకుంఠిత నిశ్చయమై, యతండు వ్రాలినదెస వ్రాలకుండిన, బలే! మముబోటులకుం బ్రియం బగుఁ" అని పలికి, నిట్టూర్పు నిగిడించి, 'దైవంబు నేర్చుగా, కిటు।పోవఁగ నే నేర్తు – నేరఁబొమ్మనిపలుకంగా వశమే నరునకు'– అని చెప్పినట్లున్నది. ఆ మూలమున కిది వ్యాఖ్యానము. మహాకవులగంటము లప్రతిహతములైనవి గదా!

ఇంతేగాదు. "తస్యాం రజన్యాం వ్యుష్టాయాం" అన్న మూలమునకు "ఎట్ట కేలకుఁ బ్రభాతం బగుటయు"నని వ్యాఖ్యానము చేయుటయు, రెండు వందలశ్లోకముల సనత్సుజాతీయము నొక చిన్నవచనముతో దాటించుటయు, మూలమున సరాసరి సంజయుఁడు రాజభవనములకుఁ బోఁగా, ననువాదమున పదిపద్యములతో చంద్రాస్తమయ – సూర్యోదయాది వర్ణనముచేయుటయు జరిగినది. ఇట్లుచేయుట ఆంధ్రభారతమునకుఁ గావ్యత్వము సంపాదించుటకై యుండును. ఏమైనను, 'యథాస్మై రోచతే విశ్వం తదేవం పరివర్తతే' అనుట యథార్థము.

కృష్ణుఁడు కౌరవసభకుఁ బోవునపుడు ధర్మరాజాదులు చెప్పినమాటలు మూలమునఁ గొంచెము తక్కువగా మూడువందల శ్లోకములు. అనువాదమునఁ దొంబది తొమ్మిది పద్యములు. 'అస్మాన్ వేత్థపరాఞ్ వేత్థ' అనుశ్లోకము

నకు 'మ మ్మెఱుఁగు—దెదిరి నెరుగుదు' నన్న పద్యమున్నది. కాని 'పా మ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్' అను ఎత్తుగడ లేదు. అదియే ఆ పద్యమున కాయువుపట్టు! అంతేగాదు. 'ఆపద గడవం బెట్టఁగ'' అను పద్యమునకుఁ గూడ మూలము కనఁబడదు. సహదేవునిమాటలతో. మూలమున – 'కథంను దృష్ట్వా పాంచాలీం తథా కృష్ణ సభాగతాం: అయుద్ధేన ప్రశామ్యేత మమ మన్యు స్సుయోధనే' అన్నదానికి, అనువాదమున 'రక్కసు మాడలాడెదరు' 'తలఁపంగూడునె' 'వీరలు ధర్మమార్గము' 'తుదిరాజ్యంబు సగంబు గొమ్ము' ఇత్యాదిగా నాల్గుపద్యములు చెప్పె. ఇవి తిక్కనగారి ప్రతిభోత్థాపితములు: ద్రౌపది శ్రీకృష్ణునితోఁ జెప్పుటయు, నతఁ డామె నూఱడించుటయు మూల మున నేఁబది శ్లోకములు – అనువాదమున నిరువదియైదుపద్యములు. ఇరు వదియైదైనను అన్నియు నమూల్యములు :అనల్పకల్పనావిలసితములు.

కుంతీదేవిని కృష్ణుఁడు చూచుఘట్టము మూలమున నూటయేడు శ్లోక ములు. అనువాదమున నిరువదియేడు పద్యములు. కాని, "ఇది యెల్లను నొక తల" "తన్ను దన దమ్ములను" అనుపద్యముల కాకరము కన బడదు. భోజనానంతరము విదురుఁడు చెప్పిన మాటలు – మూలమున ముప్పది శ్లోక ములు–అనువాదమున రెండు పద్యము లొకవచనము. కొంచెమే చెప్పినను ప్రత్యక్షదర్శనము చేసిన ట్లున్నవి. పైఁగా, మూలములోని "బధిరే ష్వివ గాయనః" "చండాలేషు ద్విజో యథా" యన్న యుపమానస్పర్శ లేని అచ్చపు హృదయావిష్కారములు. కృష్ణుఁడు కౌరవసభలో నాడినమాటలు మూలమునందు ననువాదమునందు సమముగనే యున్నవి. కాని "సతామ వస్థాం సంప్రాప్య కృష్ణాం ప్రేక్ష్య సభాగతాం । ఉగ్రధర్మా దమేయాత్మా నా కంప్యత యుధిష్ఠిరః" అన్నిదానిని దీసికొని, "సభఁ ద్రుపదాత్మజ భంగపెట్టరే" అని యుగ్గడించి, "దానికి నీ వొడంబడితి" వని యాతని తప్పు నెత్తిచూపి, తర్వాత ధర్మజశాంతిశీలముల బ్రశంసించుచు రెండు పద్యములు చెప్పెను. దీనికి మూలము లేదు. ఇవి తిక్కనగారి యౌచిత్య విచారక్షేత్రములోఁ బుట్టి పెరిగినవి.

దంభోద్భవుచరిత్ర మూలమున నేఁబది శ్లోకములు – అనువాదమున నొక్క సీసము. జామదగ్న్య కణ్వ నారద గాలవాదుల యుపదేశములు

మూలమున నేడువందల శ్లోకములు అనువాదమున నలువదియేడు పద్యములు. మునుల ప్రసంగమున వ్యాసులకుఁ బ్రీతి మెండని తోచును. ఇంత చెప్పినను, మూలమున మునుల మాటలకు దుర్యోధనుని ప్రతివచనము లేదు. ధృతరాష్ట్రుఁడే – "భగవన్నేవ మే చైతత్ యథా వదసి నారద" అని బదులిచ్చెను. అనువాదమున నట్లు గాక, "దుర్యోధనుండు రాధేయుం గనుంగొని, చేయప్పళించి నవ్వి, 'వీరలింత వెఱ్ఱు లగుదురే' యని పలికి, మునుల నవలోకించి, "మునులార! నన్ను విధి యేమని మును పుట్టించె నట్టుల య్యెడు"నని పరిహాసవాక్యములు పలికెను. ఆ మహాసభలో మునులయెదుట వారినిగూర్చి దుర్యోధనుఁ డిట్లు పరిహాసముచేయుట సంస్కృతాంధ్ర భారతములు పుట్టినకాలమహత్త్వ మని తోచును. లేక, తిక్కనగారి యౌచిత్య విచారచర్చ యైనను గావచ్చును.

భీష్మ ద్రోణు లొత్తిచెప్పిన మాటలు మూలమున "తావచ్ఛామ్యతు వైశసం" అన్న శీర్షికతో దాదాపు ఇరువది శ్లోకములు. గాంధారి హితము పల్కిన మాటలు నలువదియైదు శ్లోకములు. అన్నియు వదలి యనువాదమున గాంధారి హితముగా నొక చిన్నవచనము వ్రాసి ముగించెను. విదురుని మాటలు పదుమూడు శ్లోకములకు ఒక పద్యము చెప్పెను. విశ్వరూప ప్రదర్శనమున కృష్ణుని యాఱుశ్లోకములకు అనువాదమున "ఏ నొక్కరుండని తలంచియే దుర్మదంబునం బోదివిపట్టు నుత్సాహంబు చేసి "తని యొక వాక్యము – ఇత్యాదిగా సంగ్రహించి తిక్కనగారు – కృష్ణానుగ్రహముచే లబ్ధచక్షువైన ధృతరాష్ట్రుని "అనిన పలుకులకు నచ్చట । జనులెల్ల నృపాలు సితవిశాలాక్షుఁ గనుం । గొనుచుండిరి" అని హృదయము విచ్చి పొగడెను. మూలము "లబ్ధచక్షుష మాసీనం ధృతరాష్ట్రం నరాధిపాః" అని రాజులు చూచినట్లు చెప్పఁగా, తిక్కనగారు జనులెల్ల చూచినట్లును "సితవిశాలాక్షుఁ" జూచినట్లును చెప్పి తన యామోదముద్ర వైచెను.

కృష్ణుఁడు కుంతితో సెలవు గైకొను సమయమున నామె చెప్పిన గ్రంథ మెంతో యున్నది. అంతటికి ననువాదమున – "విక్రమోపజీవులయిన ముచికుందుండును సంజయుండు" ననువారి కథలు చెప్పి "చేతుల లావునం గలిగిన జీవనంబునం బ్రదుకుం"డనుమని చెప్పి ముగించెను. భీష్మ ద్రోణులు చెప్పిన మాటలు నలువదిశ్లోకము లుండగా మూడు పద్యములు చెప్పెను.

కృష్ణ కర్ణుల సమావేశము మూలమున నూటయిరువది శ్లోకము లుండఁగా ననువాదమున నిరువదియాఱు పద్యములు చెప్పెను. ఈ చెప్పుటలో కర్ణుని మాటలు "ప్రాప్యచాపి మహద్రాజ్యం తదహం మధుసూదన । స్ఫీతం దుర్యోధనా యేవ సంప్రదద్యా మరిందమ" "నతదా భవితా త్రేతా నకృతం ద్వాపరంనచ" "పరాజయం ధార్తరాష్ట్రే జయం చ యుధిష్ఠిరే" ఇత్యాదిగా నున్న పెక్కుశ్లోకములు గూడ ననువాదమునఁ గనఁబడవు. కావుననే మూల మంతగాఁ బెరుగుటయు, ననువాదము కురుమట్టముగా దిగుటయు సంభవించినది.

శ్రీకృష్ణుఁడు కౌరవసభలోఁ బల్కిన మాటలన్నియు ధర్మరాజాలకుఁ జెప్పెను. ఇచ్చట నూట ముప్పైయెనిమిది శ్లోకములు మూలముననను ఇరువదియాఱు పద్యము లనువాదముననను గలవు. కాని, భీష్మ ద్రోణ విదుర గాంధారీ ధృతరాష్ట్రుల మాటలుగా నున్నవానినిగూడ ననువదించలేదు. ఇవి ప్రత్యేక గమనార్హములు. భీష్ముఁడు "మాతాత! కలహం కార్షీః రాజ్యస్యార్థం ప్రదీయతాం । మయిజీవతి రాజ్యం క స్సంప్రశాసే త్పుమానిహ" అనియు, ద్రోణుఁడు-"భీష్మేణ దత్త మిచ్ఛామి నత్వయా రాజసత్తమ । నాహం త్వత్తోఽభికాంక్షిష్యే వృత్త్యుపాయం జనాధిప । యతో భీష్మ స్తతో ద్రోణో యద్భీష్మ స్త్వాహ తత్కురు, దీయతాం పాండుపుత్రేభ్యో రాజ్యార్థ మరికర్షణ" అనియు, విదురుఁడు, "బధ్వావా నికృతిప్రజ్ఞం ధార్తరాష్ట్రం సుదుర్మతిం । శాధీదం రాజ్యమద్యాశు పాండవైరభిరక్షితం" అనియు, గాంధారి-"న్యాయాగతం రాజ్య మిదం కురూణాం యుధిష్ఠిర శ్శాస్తు వై ధర్మపుత్రః । ప్రచోదితో ధృతరాష్ట్రేణ రాజ్ఞా పురస్కృత శ్శాంతనవేన చైవ"-అనియు, ధృతరాష్ట్రుఁడు "ప్రయచ్ఛ రాజ్యార్ధమపేతమోహ స్సవాహనం త్వం సపరిచ్ఛదం చ । తతోఽవశేషం తవ జీవితస్య సహానుజస్యేవ భవేన్నరేంద్ర" అనియుఁ జెప్పినట్లున్నది. రాజ్యభాగ నిర్ణయ చర్చలో నీ మాటలకుఁ బ్రాముఖ్యము రావచ్చును. ప్రతి యొకరి మాటలకుఁ గూడ వెనుక నేదో బలము నిచ్చు చరిత్రయు గోచరించును. ఇట్టివాని నెందుకు వదలెనో తెలియదు.

యుద్ధ సన్నాహ మంతయు శ్రీకృష్ణుఁడే చేసినట్లు మూలమున 'అకృతే నైవ కార్యేణ గతః పార్థా నధోక్షజః । స ఏనా న్మన్యునావిష్టో ధ్రువం

ధత్స్వ త్వ్యసంశయం । ఇంష్టోహి వాసుదేవస్య పాండవై ర్ధర్మమవిగ్రహాః । భీమసేనార్జునౌ చైవ దాశార్హస్య మతే స్థితౌ'-అని యున్నది. అనువాదమున నటుగాక 'హరి యలుకమెయిన్ జని యప్పాండుతనూజుల । మనమునఁ గినుకూనునట్టి మాటల సెప్పున్' అని సూచనాభ్రాయముగాఁ జెప్పినట్లు తోచును. కాని యతఁడే కారణమని చెప్పలేదు. ఉలోకోపాఖ్యానము మూలమున దాదాపు మూడువందల శ్లోకములు. అనువాదమున నిరువదియైదు పద్యములు. అంబోపాఖ్యానము మూలమున దాదా పేడువందల శ్లోకములు అనువాదమున నూటముప్పది పద్యములు. ఈ విధముగా మూలమన్యాహతముగాఁ బెరిగినది. దీనిని సరిదిద్దుకొని యనువదించుటలో నుద్యోగపర్వ మింతమాత్రము దిగినది. సనత్సు జాతీయాదులవలె, వృత్రాసురాదుల కథ, ఉలోకోపాఖ్యానము, అంబో పాఖ్యానము మున్నగాఁ గథలు మఱి కొంత బిగపట్టి వ్రాసినచో మఱికొంత తగ్గియుండ వచ్చును. ఈ కొలత లన్నియు పాఠకులకు వదలుదము. ఉద్యోగపర్వము నెట్లు తీర్చెనో యిపుడు కనుగొందము.

అభిమన్యుని వివాహానంతరము పెండ్లికి వచ్చిన బంధువులందఱు చేరి కార్యనిశ్చయము చేయఁబూనిరి. మూలమున లేకున్నను, 'దిన చతుష్టయానంతరమునఁ' ఈ సభ జరిగినది. లోకాభిరామాయణమునంతయు వారించి శ్రీకృష్ణుఁడు బంధుప్రీతిఁ బురస్కరించుకొని, పాండవుల యరణ్యాజ్ఞాత వాసక్లేశాదుల నుగ్గడించి 'ఏనును నాకన్నంత చెప్పెద' నని యుపన్యసించి, 'బలము లేక దోర్గర్వముమై గెలువంగ వశమే' యని సహాయసంపదావశ్యకతను చెప్పి, 'కావున నియ్యవసరంబునఁ దగిన మానిసి నందులకుం బుచ్చవలయు' నని వాక్రుచ్చెను. ఇది ప్రకృతోపయోగిగా నున్నది. బలరాముఁడామాటల నందికొని ప్రశంసించి, 'ఇత్తెఱంగున వార లధర్మపరు లని నిందింపరాకునికి కారణంబుగా నయంబుతోన యిక్కార్యంబు దీర్చికొని రావలయు నని మూఁదలఁచెను. దీనికిఁ దగిన కారణముగూడఁ జూపెను. 'సంరంభమాణో విజితః ప్రసహ్య తత్రాపకార శ్శకునే ర్న కశ్చిత్ । తస్మాత్ప్రణమ్యైవ వచో బ్రవీతు వై చిత్రవీర్యం బహుసామ యుక్తం' అని. అది ఆయన యభిప్రాయము.

పై మాటలకుఁ గోపించి సాత్యకి 'ఇట్లాడఁదగువె - ఇది నీక పోలు "వేడుక పుట్టిన జూదంబాడెనె? ధర్మజుఁడు?" 'ధర్మతనూభవు దెస దుష్కర్మమురూపించి' 'ఉక్కువుండగు ధార్తరాష్ట్రుఁ । గ్రూరశరముల నే నియ్య

కొలుపువాఁడ' ఇత్యాదిగా నాగ్రహము వెడలఁగ్రక్కెను. ద్రుపదుఁడు - 'ఇది పోలు, బలరాముని మాట మాటగా'దని దానిని బలకొట్టెను. శ్రీకృష్ణుఁడు 'పాంచాలపతి వచనంబు లుచితంబులై యున్నవి. ఇభ్భంగిన చేయవలయు' నని పలుకుచుఁ, జివరకుఁ 'బొందైన లెస్స, విరసపుఁ । గ్రందయ్యెడుచందమైన. రాజుల నెల్లన్ । ముందఱ రావించి, క్రమం । బొందఁగ మముఁ బిలువఁ బంపుఁ డొయ్యన పిదపన్' అని ద్రుపదునితోఁ జెప్పి, తాను బలదేవసహితంబుగా వెడలిపోయెను. తక్కినరాజులును బోయిరి. ద్రుపదుఁడు తన పురోహితునిఁ గౌరవులకడకుఁ బంప నిశ్చయించెను. ఇంతవరకు బంధువుల ప్రయత్నమే జరిగినది. రాజ్యముఁ బొందవలసినవారు పాండవులే యగుట వారు ప్రయత్నించినను దప్పు గాదు కాని యిచట బంధుబలము హెచ్చినది. ఇది భవిష్యత్కార్య సూచనము. బలరాముఁడుమాత్ర మొక్కఁడొంటరివాఁ డయిపోయెను. ధర్మరాజాదుల ప్రసక్తి యిందు రాకుండుట జ్ఞప్తియం దుంచుకోవలెను.

యుద్ధసహాయముకొఱకు దుర్యోధనార్జునులు శ్రీకృష్ణుని దర్శించిరి. ఆగమన దర్శనముల సామ్యముఁ జూపి శ్రీకృష్ణుఁడు, తన్ను - నారాయణ గోపాలు రను రెండు పక్షములుగాఁ బెట్టి, బాలుఁడు ముందు కోరుకోవలయు ననెను. అర్జునుఁడు శ్రీకృష్ణుని కోరుకొనఁగా దుర్యోధనుఁడు సంతసించి తక్కినవారిని గైకొని బలరామునొద్దకుఁ బోయెను. అతఁడు ముందు జరిగిన సంఘటన చెప్పి, తా నెవ్వరికి సాయపడక యుందు నని చెప్పెను. దుర్యోధనుఁడు దానికి సమ్మతించి కృతవర్మసహాయముఁ దీసికొని వెడలిపోయెను. శ్రీకృష్ణుఁడు తాను యుద్ధము చేయకపోయినను, నీరథసారథ్యము చేయుదు నని చెప్పి. 'కార్యాలోచనము సేయుబుద్ధి'తో అర్జునుని వెంట ధర్మరాజుకడకు వచ్చెను. ఈ విధముగాఁ బాండవపక్షమునఁ గొంత బంధుబలము హెచ్చినది. బలరాముని కౌరవపక్షపాతము మఱింత వ్యక్తమైనది. కాని, ఇప్పటికిని ధర్మరాజునకు యుద్ధమును గూర్చి స్పష్టమైన యాలోచన యేమియు లేదని తెలియుచున్నది.

శల్యుఁడు పాండవులకడకు వచ్చుచుండఁగాఁ ద్రోవలో దుర్యోధనుఁ డాయన కుపచారములు చేసి మెచ్చించి, తన కమాత్యుఁడుగా సైన్యము నడుపునట్లు వరముఁ బొందెను. శల్యుఁ డంగీకరించి, ధర్మజుఁ జూచి వచ్చెద

నని చెప్పి యాతనికడకుఁ బోయెను. వారి సంభాషణములలో ''సమరస మయంబున నిరాకరించి పలికి, కర్ణునిచిత్తంబునకుఁ గలఁకపుట్టించి, పార్థు రక్షింపవలయు' నని ధర్మరాజు ప్రార్థించుటయు, శల్యుఁడు 'అగు, నిదివో వోలును, నాకుం దగ నిట్టిద' 'కర్ణుని సారథినైనను, నిర్ణయమున నేను పార్థునిం గాచెద'నని బదులు సెప్పుటయు జరిగినది. ఈ శల్యుని చరిత్ర చాల చిత్రముగా నగుపడును. ఉభయపక్షముల కాతఁ డెట్లు సాయముచేయఁగలడు? 'శల్యసారథ్యము' చేయుట యనఁగా నిట్టిదే కాఁబోలు ముందుముందుగనే 'తనకు కర్ణ సారథ్యము వచ్చు'నని యెట్లు తెలిసికొనెను? ఇదంతయు నగోచర మైనది. ఏమైనను యుద్ధములోఁ గర్ణసారథ్యము వచ్చినపుడు, అతఁడు మాట తప్పనివాడైనపుడు, కొంతసాయము ధర్మపక్షమునకు రాఁగలదు. కాని పూర్ణసహాయము పొందువాఁడు దుర్యోధనుఁడే కావలయును. ఎట్లైనను శల్యుఁ 'డెత్తువారి చేతిబిడ్డ'గా నిందుఁ గనబడుచున్నాఁడు. శల్యుఁడు చెప్పిన మాటలఁబట్టి 'కౌరవనాథుఁ డానహుషుకైవడి నాశముఁ బొందు, వాసవ । క్రీరమణీయుఁడై జయము చేకొను ధర్మజుఁ''డన్నమాటలు యథా ర్థములుగా నగుపడును. ఇంతవరకు నుభయపక్షములఁ జేరు బలములఁబట్టి యుద్ధము జరుగు సన్నాహము మాత్రము ధర్మరాజునకుఁ దెలిసియుండు నని మనము తలంపవలెను.

రెండుపక్షములసేనలు నిండుకొనుచున్నవి. ద్రుపదపురోహితుఁ డాడిన మాటలు మెచ్చుకొని భీష్ముఁడు– 'నీవాక్యము విప్రస్వాభావికమై యిట్లు శ్రుతికిఁ బరుషంబైనన్ । భావింపఁ గార్యమునయం । దేవిధమున సభకు నింత యిష్టంబగునే' యని ప్రశంసించెను. ధృతరాష్ట్రుఁడు 'పెద్దల విచారించి సౌమ్యు నొక్కరిని బాండవులయొద్దకుఁ బంపెద'నని చెప్పి పురోహితుని సాగనంపి, సంజయునకుఁ దగినబోధ చేసి అతనిని పాండవులయొద్దకుఁ బంపెను. సంజయురాయబారముగూడ శమప్రధానముగనే నడచినది. కాని, ధర్మ రాజు–'రెండుపక్షములు సమానబలంబు లనుటకు నే నొడంబడ' ననియు, 'నన్నుఁ దూఱం దలంచితేని నా చేయునది 'ఇది ధర్మం–బిది యధర్మం' బని నిరూపించి మఱి దూఱు' మనియు, ''రాజులకు 'సంగ్రామంబు ధర్మంబవుం–గా'దని నీవచెప్పు''మనియు నిగ్గదీసి యడిగినప్పుడు మాత్రము బదులు పలుక లేదు. శ్రీకృష్ణుఁడు తగిన మాటలాడుచుఁ, గడకు – 'ఏ నీ పనికై వచ్చెద'

నని సమాధానము చెప్పెను. దానితోఁ దృప్తిపడి సంజయుఁడు వెడలిపోయెను. ఈ విధముగా, ద్రుపద పురోహిత - సంజయుల రాయబారములు 'మెట్టియలచప్పుడే గాని ప్రయాణము సాగలే' దన్నట్లు కడచినవి. 'పాండవేయులఁ దగఁ బ్రార్థించి, యందుల కక్కట! యేనైన నరుగుదెంచి' యని చెప్పుటయే గాక, 'దానన నెగడెదమే, మ । మ్మానవనాథునకుఁ జెప్పు మామత మెల్లన్' అనియు కృష్ణుఁ డన్న మాటలలో 'ఏము నెగడెద' మను మాట పులకలు పుట్టించినది. యుద్ధము లేక బంధుక్షయము లేక సంధి కుదురునని ధర్మరా జెంతో యాసపడినాఁడు. శ్రీకృష్ణునిఁ బ్రోత్సహించినాఁడు.

'ఆపద గడవం బెట్టఁగ । నోపి శుభంబైన దాని నొడగూర్పఁగ'నని ప్రారంభించి, ఏ మ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్' అనునంతవరకు, నీ యవినయ సౌశీల్యములు శోభిల్లఁ, 'గౌరవసభకు పోయి ర' మ్మని ధర్మరాజు శ్రీకృష్ణునిఁ బ్రార్థించెను. 'మోదంబందుట గల్గుఁ గౌరవులు నేముం బొంది శ్రీ నొందినన్' 'ఐదూళ్లను మా కిచ్చినను జాలు' నని హృదయపూర్వకముగనే చెప్పెను. అది సరియే. భీముఁడు కౌరవ నికారదందహ్యమాన మానసుం డయ్యు ఆ పొంగు నాపుకొని తనమాటనే యనువదించెను. అర్జునుఁడుకూడ, 'ధర్మంబున్ విచారించి చూచి 'తగుం బొ'మ్మని యేది పంచి-తది నిశ్చింతంబునం జేసి యు । న్నతిఁ బొందంగలవార' మని కాయఁకొడవలి కృష్ణుచేతఁ బెట్టెను. నకులుఁడు 'కడవఁగ నొకళ్లు పసరము । నడఁచిన, నొక్కఁశులు పెయ్య నడపవలయునే' 'నీవు పోయినపుడ యికార్యంబు సక్కనగు'నని సంధినే బలపఱచెను. పై మాటలలో 'పాళ్ల' భేద మెట్లున్నను అందఱు తన మాటనే తథాస్తనిరి. ఇది కృష్ణున కెట్లున్నను, తక్కినవారికి సవ్యముగనే కనఁబడినది.

సహదేవుఁడు మాత్ర మట్లు చెప్పలేదు. తనకుఁ దోచిన ధర్మముగా, నిర్భయముగా 'తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్ము' ఇత్యాదిగాఁ గట్టె విఱిచినట్లు మాట్లాడెను. సాత్యకి మొదలుగా నందఱును 'సహదేవుఁ డింత యొప్పుఁ బలుకునే' యని ప్రశంసించిరి. సంఖ్యకుఁ జూడ నా పక్షమే యెక్కువగాఁ దోచెను. ద్రౌపదిమాటఁ జెప్పఁబనిలేదు. ఆవేదన పట్టలేక, 'బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విచ్చి'వలకేలఁ బూని 'ఈ వెంట్రుకలఁ బట్టి యీడ్చిన యాచేయి' ఇత్యాదిగా నక్కసునంతయు వెడలఁగ్రక్కి, 'నేను

రాజరాజుపీనుంగు గన్నార। గానబడయమేని' యని వలవల నేడ్చినది. ఆ యుద్రిక్త వాతావరణములోఁ గృష్ణుఁడు 'నీ మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁగాక' యని యామె వీపుదట్టి యభయ మిచ్చెను. వై పరిస్థితులలోఁ దనధారణ తల్లక్రిందు లైనట్లైనది. కృష్ణుఁడే నిబ్బరించుకొని, 'మీ। కును హితము ప్రియంబు చేయగోరియ, కుంతీతనయాగ్రజుపని ధృతరాష్ట్రునికడకుం బోయెద' నని సంధి సమాధానము చేసెను. అదియే సమయ మని 'అట్లుచేయుము. మన నిశ్చయ మదియ' యని ధర్మరాజాది పలికెను. కొంతవఱ కట్టి నిశ్చయముతోనే పలికెను. కృష్ణుఁడు కౌరవ సభకుఁ బ్రయాణమయ్యెను. జరిగినదానిలో రెండువంతులు యుద్ధము — ఒకవంతు సంధిగా నున్నట్లు అప్పటికిఁ గనఁబడినది !

కౌరవసభలో హితబంధుసమ్మతముగా, రాజనీతి సమ్మతముగా, సామదానభేదాదులు ప్రయోగించి శ్రీకృష్ణుఁడు మాటలాడెను. నారద జామదగ్న్యాదులతో మాటలాడించెను. భీష్మ ద్రోణ విదురాదులు కూడఁ గట్టుకొని గట్టిగా మాటలాడిరి. కాని లాభము లేదు. దుర్యోధనుఁడు 'వాఁడి సూదిమొన యించుక మోపిన యంతమాత్రముఁ। భూమి యొనర్చి పాండు నృపపుత్రుల కిత్తునె ? యెవ్వరైన సం। గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్' అని మొగమోటవిడిచి మాట్లాడెను. ఇక్కడికి సంధి సగము విరిగిపోయినది. దుశ్శాసను ప్రేరణతో దుర్యోధనుఁడు సభనుండి లేచిపోయి శ్రీకృష్ణుని కట్టివేయు ప్రయత్నములు గూడ చేసెను. సంధి పూర్తిగా భగ్నమైనది. శ్రీకృష్ణుఁడు విశ్వరూప ప్రదర్శనముతో బయటికి వచ్చి భీష్మాదులతో 'అంతయు మీ రెఱుఁగుదురు. ఈ రాజు తప్పు తనది లేదని చెప్పెను. ఇఁక నేఁ బోయివచ్చెద నని మొగము గంటు వెట్టుకొని కుంతికడకుఁ బోయెను. ఆమెయు 'దైవము మేలు చేసె, చేతుల లావునన్ గనిన జీవనంబున బ్రతుకుండను' మని హితము చెప్పెను. తర్వాతఁ గృష్ణుఁడు 'నన్ననిచి వత్తువుగాక ర'మ్మని, కర్ణుని రథ మెక్కించుకొనిపోయి, ఏకాంతముగా నేమియో మాటలాడెనఁట. కర్ణుఁ డన్నింటికి సమాధానము చెప్పెనఁట. ఆ వివరములు తెలియకున్నను సంధి కుదురలే దనుట స్పష్టము. ఇట్లు అందరితో మాటలాడి, అన్నిపనులు ముగించుకొని హుటాహుటి పయనంబై కరినగరంబునకు వచ్చి కృష్ణుఁడు పాండవులకు యథాతథముగ వివ

రించెను. సంధి మఱువవలసినదిగా యుద్ధము జరుగవలసినదిగా ఆలోచన ప్రారంభమయ్యెను.

కృష్ణుఁడు కౌరవ సభనుండి వచ్చి 'కౌరవులయెడ దండంబుదక్క నొండుపాయంబు లేదు. మీకుం బోలిన తెఱంగు సేయుం'డని చెప్పెను. పాండవదూతగా నతఁడు చేయవలసినపని యంతయే గదా! ఇక నిర్ణయించు బాధ్యత యుధిష్ఠిరునిది. యుద్ధ మనఁగా బదునెనిమిది యక్షౌహిణుల సైన్యము - కొంచెము తక్కువగా నైన - నాశము చేయు కార్యము. అంతులేని జగత్సంహారము. అంతపని చేయలేకయే ధర్మరా జింతవరకు నారాటపడెను. చివర కామాటయుఁ దానే చెప్పవలసివచ్చినది. భీభత్సాకారమైన యాదృశ్యము తన కన్నులయెదుట వ్రేలుచున్నపు డామాట యెట్లు చెప్పఁగలఁడు? చెప్పకున్న వేఱుమార్గ మేమి? ఇది ధర్మరాజునకుఁ గఠినసమస్య. కురుక్షేత్రసంగ్రామమునకు ముఖ్యకారకు లెవ్వ రనునది పాఠకులసమస్య! ధృతరాష్ట్రుఁడు మూలకారణము, దుర్యోధనుఁడు ముఖ్యకారణము, కర్ణుని తలపై భారతము, - ఇత్యాదిగా వారు వా రనుకొనుటయు గలదు. 'భీష్ముఁ డొక్కఁడు చక్కఁగ నిలచిన నిఁక యుద్ధమేమున్న' దనుటయు సంగతముగనే తోఁచును. ఇదంతయు రాజ్యభాగ మీయక యుద్ధము జరుగునప్పటి మాట; భాగ మిత్తురో - యుద్ధమునకు వత్తురో తేల్చుకొని వచ్చినవాఁడు కృష్ణుఁడు. చేయవలసినవాఁడు ధర్మరాజు. ఇది యిప్పటి పరిస్థితి. యుద్ధమే చేయుదమన్న, నాతనికి ధర్మ మొకవైపు, వంశనాశన మొకవైపు, మరల నరణ్యములకే పోవుదమన్న - నసమర్థత యొకవైపు. 'సిరి నా కేలందునే - గ్రాసవాసో దైన్యంబులు వచ్చునా యరయు నీచుట్టాల' కన్నది యొకవైపు, తప్పనిసరిగా నెదుఁటబడి తారసిల్లుచున్నవి. ఈ సందడిలో - ఈ పరిస్థితిలో ధర్మరా జితికర్తవ్యతామూఢుఁ డయ్యెను.

నిజమే! బంధునాశము గాకుండ, దానికై తన్ను నెప పెట్టకుండ సంధి కుదిరినచో సరిపోవును. కాని, దానికి ప్రతికూలురు దుర్యోధన దుశ్శాసన కర్ణులు - అనుయాయులు నట్టివారే! కాని, ధృతరాష్ట్రుఁడు మారిపోవుట కేమి? 'కొడుకా! నే నెటు లట్లు బాహ్లీకుఁడు, నీకుం గూర్చు భీష్ముండు నీ। యెద సస్నేహుఁడు;....ధర్మజున్। విడువంగాఁ దగ, దిమ్ము

వారలకు నుర్వీం బాలు నెమ్మినన్' ఇత్యాదిగాఁ జెప్పినవాఁ డా మాటపై నిలువకపోవు టేమి ? 'నా తెఱఁగు నీ వెఱుంగుట నాకుఁ జాలు'నని శ్రీకృష్ణునితోఁ జెప్పుటేమి? ఇదంతయుఁ గృత్రిమముగదా! కృత్రిమ మని శ్రీకృష్ణుఁడే 'ఈమేదినీవి । భుండు తా నేమిటికిని ముఖ్యుండ గాను । తప్పు తనవైపు లేదని చెప్పి విడిచె'నని చెప్పలేదా ? ఏమో ! ధృతరాష్ట్రుని హృదయ మిట్లు చీకటికోన యైనది. కాని, భీష్ముఁడైన నిక్కచ్చిగా మాటలాడు నను కొంటిమి - మాటలాడెనుగూడ. కాని లాభము లేదు. 'మాకుం జూడఁగ బోలు కార్య మిది; ధర్మప్రీతి నీ వేగి, సు । శ్లోకుం డైన యుధిష్ఠిరుం గని, జనస్తుత్యంబుగా శాంతిమై । నీ కౌరవ్యుల నెల్లఁ గాచికొనవే' అని ప్రార్థించియు, వినకపోగాఁ, దన జీవితముపైనే విసుగుదోచి, శాంతి నావహించి కొని 'కురునృప ! విను, సంసారము । దరి ద్రొక్కినవార - మింకఁ దరలె దమే సం । గరమునకు ? నేము నీకై పొరలితి' మని చివరిమాట మాట్లాడి వెళ్ళిపోయెనఁట ! అంతటివాఁ డట్లైనపు డిక మరలించువాఁ డెవ్వఁడు ? ద్రోణ కృపాశ్వత్థామాదు లాయన యనుచరులేగదా ; భీష్మునివంటివాఁ డిట్లగుట కాలమహిమ! లేక దైవమును శ్రీకృష్ణునిలోఁ జూడఁగల యాతని సమాధినిష్ఠ యనవలెను. సరియే! కృష్ణుఁడైన స్పష్టముగాఁ జెప్పకపోయెనే!

తనవైపున భీమార్జుననకులులు తనవారే: అర్జునుఁడు తనమాట కాదన లేదు. కృష్ణునిమాట చూదవలెనన్న ఒకవిధముగా సరిపెట్టుకొన వచ్చును. సహదేవుఁడు పైకి యథార్థవాదిగాఁ గనఁబడినను లోపలనార్ద్రత యున్నది. మార్దవ మున్నది. ద్రౌపది చివరకు మనమాటకు రాకపోదని నమ్మకము. కాని, యిపుడు మిగిలినది శ్రీ కృష్ణుఁడు. 'అంద ఱొక యెత్తైన నగస్త్యుఁ డొక యెత్తు'వలె నున్నాఁడు. బలపఱచినచో నిటు సంధికాని యటు విజయముకాని చేకూరుట కనఁబడుచున్నది. కాని, అతఁ డలౌకికపురుషునివలెఁ గనఁబడును, జగమంతయు నాతని నలౌకికపురుషునిగనే భావించును. అతఁడు నాదగ్గర నా మాటలకు సమ్మతించును గాని యాచరణమున నన్యథా ప్రవృత్తి గనఁబడును. ఇట్లగుటకుఁ గారణమేమి? "మీకుఁ బోలిన తెఱంగు సేయుం" డనెను గదా? దీని కర్థ మేమై యుండును ?

శ్రీకృష్ణునిగూర్చి మరియు నిట్లాలోచించెను, అభిమన్యు వివాహానంతరము జరిగిన సభలో నన్ని సంగతులు మాట్లాడినవాఁడు- చివరకు అందఱు

వచ్చిన పిమ్మట మాకుఁ జెప్పి పంపుఁ డనుటేల? అతఁ డక్లే యుండక శ్రీ కృష్ణుఁడు ఆ 'చెప్పిపంపుఁడన్న వాఁడు సహాయముచేయుటకై వచ్చి కార్యా లోచనమునకు దిగుటేల? దిగినతర్వాత నూరకుండెనా ? సంజయునితో మాట లాడునపుడు- "ఎట్లయినను వీరికి పోటు మేలు నాకుం జూడఁగ" అనియు, "వారెట్టితులువలో - ద్రౌపది నట్టులు పఱిచెడిదే" "అయ్యోడరు రాచకుమా రకు లోర్చునట్టిదే" ఇత్యాదిగా చొచ్చుకొని మాటలాడనేల? "రోషమయ మహాతరువు సుయోధనుఁడు" "ధర్మజుండు ధర్మతరువు" అని నన్నెత్తిచూపి బలకొట్టనేల? "ధార్తరాష్ట్రులు సడికి నధర్మమునకు నలుక రెప్పుడు: విడువు దైన్యంబు: పొడువు కయ్య" మని నాకుఁ దఱిమి చెప్పనేల? దీనినిఁబట్టి యుద్ధము సేయు టతని కిష్ట మని స్పష్టము కదా? అయినప్పుడా మాటయే యేల చెప్పరాదు. అర్జునుఁడు "మాకిట్లు సేయు మని యాజ్ఞ యిమ్మనఁగా "సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయుఁగ। దైవముచేత యెట్లగునో" యని యోసరిల్లు టెందుకు? భీముఁడు సంధిచేయు మనిచెప్పఁగా "వెఱపెట్టి దియో యెన్నడు నెఱుగని నీయట్టివాని కెవ్వరొకో యీ । పిఱికితన మింత యలవడం।గఁజినవా"రని కలకల నవ్వు టేల? సహదేవుఁడు ",సుయోధనుఁ డెక్కడ - భూమిలోన సగ మిచ్చుట యెక్కడ"నని ఱొమ్ము విఱుచుకొన్న కొన్నపుడు కొలువెల్లఁ బ్రశంసింపఁగా, దా నందులో నుండియు లేనట్లు నడ చుకొనుటేల, సరే- ద్రౌపది నూరడించుచు "శత్రుసంశయము చేసెద,ఏమది చూచి చెప్పినను దపుదుమేరువు దిరగనేని" యది కన్నులార చూచిచెప్పిన యట్లుగా మాట్లాడెనే' దీనికర్థ మేమి! కరిపురికిఁ బోయెద నని నాతోఁ జెప్పు టలో నాంతర్య మేమి? ఇవన్నియు నొకదానితో నొకటి పడక తాఱుమాఱు లగుచున్నవి.

ప్రత్యక్షానుభూతము లిట్లుండగాఁ, బరోక్షము లింతకంటెఁ బదిమడుం గులు. భీష్ముఁడు ధృతరాష్ట్రునితో "అతఁడు సేయఁబూనినపని తప్పింపఁగ రాదు, ఆ పురుషుపనుపు సేయు" మనెనఁట! దుర్యోధనుఁడు తండ్రితో కృష్ణు బంధించు ప్రయత్నము సెప్పఁగా ధృతరాష్ట్రుఁడదరిపడి "ఓహో ! యిట్లనుట జగద్ద్రోహం"బని యాతని నదలిఁచెనఁట! కుంతి కృష్ణునిఁ బ్రశం సింపుచు "జగంబులకెల్లఁ। జేరుగడ నీవ, నీపలు। కారయ వేదంబకాదె"యని పొగడెనఁట! దుర్యోధనుఁడు "మేము పగతులమా? మాయింట నేల భుజింప"

నన నతఁడు నవ్వుచు ''అలుగుదు పాండవులకు, వారలు నాకుం బ్రాణములు, ధరావల్లభ! యిట్టులముగ దమప్రాణములకు నలుగు జనులు పగతు రగుట యనుమానం బే''యని ప్రత్యుత్తరించెనఁట! విదురుఁడు శ్రీకృష్ణునితో ''నీవా తులువలకడ కేల పోయెద''వనఁగా, బిగువు మొగముఁ బెట్టి శ్రీకృష్ణుఁడు, ''నీ తలంచిన చందంబునం దులువలై కలఁగంబాఱిన - వారు నాయెదుట నిలుతురే'' యని తునియఁబలికెనఁట! ఇట్టి మహామహిమ లెన్నియో గలవు. అన్నిటికంటె నీయొక్కటి వర్ణనాతీతమైనది. దుర్యోధనునితో మాటలాడుచు శ్రీకృష్ణుఁడు- ''ఒక కార్యము సెప్పెద, మీసకలబలములందు సవ్యసాచి కెదురుగా నొకరుఁడు గల్గినఁ గయ్యమునకుఁ బూనుఁడు, రిత్తబహుజనక్షయ మేలా?'' ''తోడు దొనలేని యప్పటి క్రీడికొలదియట్టి-దధిప! కినియక విను, మేఁదోడై రా నెదుట కడుఁగీడు, వలవ దుడుగవయ్య! గెలు పరిదిసుమీ!'' యని ఘంటాఘోషముగాఁ జాటి చెప్పెనఁట. ఇది యనన్యసామాన్య విషయము. అర్జునుని బలమున నాతని విశ్వాస మట్టిది! తనరూపాంతరమే యర్జునుడుగా భాసించునట్టిది! ధర్మముపైఁ గురువంశముపై నాతని హృదయ మట్టిది. అందుకనియే ''నేఁ దోడై రా నెదురుటకడుఁగీడుసుమీ''యని యొత్తి చెప్పెను. అన్నియు సరియేకాని యీ 'మీకుం బోలిన తెఱంగు సేయుం' డన నేల?

ఇచ్చట ధర్మరాజునకుఁగాని మఱియెవ్వరికిఁగాని తెలియనియంశము, కుంతికిని సూర్యునకును వేదవ్యాసులకును అట్టివారికి మాత్రమే తెలిసిన యంశము, కృష్ణునకుమాత్ర మెట్లు తెలిసెనో తెలియఁదగిన యంశమొకటి యున్నది. అది కర్ణ జనన వృత్తాంతము. దానిని కర్ణునకుఁ దెలుపుటకే యాతనిని రథ మెక్కించుకొని కృష్ణుఁడు దూరముగాఁ గొనిపోయెను. దానినుద్యోగపర్వమునఁ జదివితిమిగదా! శ్రీకృష్ణుఁడు కర్ణున కాసలుచూపి బాసలు చేసి, నయభయముల బెదరు పుట్టించి చెప్పుటయు, కర్ణుఁడప్రధృష్యుఁడై యన్నింటికి బదులిచ్చుటయు జరిగినది. అంతకంటె నెక్కువగా ధర్మరాజున కేమియు దెలియదు. తెలియవలసిన సందేహముకూడఁ గలుగలేదు. కాని యా ఘట్టములో జరిగిన ఫలితాంశమేమైన కృష్ణుని ప్రవృత్తికిఁ గారణమైయుండునేమో! అది యూహింపరానిది:

కృష్ణుఁడు మాత్రమే యెఱిగిన యింకొక విశేషమున్నది. విశ్వరూప ప్రదర్శనానంతరము భీష్మద్రోణబాహ్లికాదులవైపుచూచి శ్రీకృష్ణుడు. ''ఇప్పుడీసభఁబుట్టిన యింతవట్టు। మీకుఁ దెల్లంబగాదె! యీమేదినీవిభుండు తా నేమిటికిని ముఖ్యుండఁగాను।దప్పు దన దెస లేదని చెప్పివిడిచె.'' ''కావుననియ్యెడ నాకుం దడయం బనిలేదు-ధర్మపుత్రుని కింతవృత్తాంతముఎఱింగింపవలయు'' నని చెప్పెను. ఇవి సెలవుతీసికొనునప్పటిమాటలుగా గోచరించినను, ఇందులో మహార్థ మొకటి ఇమిడియున్నది. 'ఈరాజు తానేమిటికి ముఖ్యుండఁ గా' దనుచున్నాఁడు. ఇది తప్పు. ఒకరిరాజ్యము మరొకరు దౌర్జన్యముతో నాక్రమించుకొనుట, ఒక పతివ్రతను నిండుసభలోఁ గట్టుపుట్టము లొలిపించుకొనుట- ఇవి మహాపరాధములు. ప్రత్యక్షపరోక్షకారణములతో వీనికి బాధ్యులైన వారందఱు నిందులకు బాధ్యులు. అందరికి శిక్ష జరుగవలెను. ఎవరి విషయమున వీ రీతప్పు చేసిరో-వారే-ఆధర్మరాజే శిక్షింపవలెను. అతనిచేతనే శిక్ష చేయింపవలెను. కావుననే 'ధర్మపుత్రున కింతయు నెరిగింపవలె'నని శ్రీకృష్ణుఁడు చెప్పెను. అనర్థకరమైన మహానర్థ మిది. దానికి శిక్ష జరిపించుటయే శ్రీకృష్ణుని ప్రయత్నము. ఇది సరియే కాని 'ఆశిక్షనుగూడ దానే జరిపింపవచ్చును గదా!' యని తోచుట సహజము. అచ్చటనే శ్రీకృష్ణునియలౌకికవ్యక్తిత్వ మిమిడియున్నది. అది సామాన్యుల కర్థముగానిది.

ఈసంగతిని మఱొకరీతిగాఁ దెలిసికొనవచ్చును. దానిని సంజయుఁడు గాంధారీవేదవ్యాసులయెదుట ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పెను. సంజయుఁడు "ఆసేనకు నీసేనకు।వాసి యడిగె దీవు నన్ను, వసుదేవసుతుం।డాసేనఁగలఁడు, తత్సము నీసేనఁ జూపుము'' "అతండు పార్థునెనసి యేకార్థుఁడై యుండు - పూర్వభవసఖుండు గాన'' "అట్టి వాసుదేవుని చక్రంబు నిజమాయాబలంబుగఁ బాండవుల సర్వసమరసాధనంబులయందును సూక్ష్మరూప వ్యాపియై నిలిచి వారికి విజయంబు నొసంగుచుండు.'' "వారికి, బలమును సత్త్వంబు హరియె'' "తలఁపునన వాసుదేవుఁడు।కలిగింపను నిలుప నడఁపఁగా నోపు జగంబుల'' "నీతనూజుల నిక్కమ నిగ్రహింపఁ।దలఁచినాఁ డమ్మహాత్ముఁడు.'' ఇత్యాదిగా వివరించెను. ఇంతగాఁ జెప్పినను వినని మహామౌర్ఖ్యమునకుఁ బ్రతిక్రియ యేముండును? సకలజగన్నియామకుఁ డయిన భగవంతుఁడే అట్టి ప్రతిక్రియను జెప్పి చేయించవలెను. ఎట్లును జేయువాఁడు లేనప్పుడే భగవం

చేసెను. తరువాతగూడఁ జెప్పియుండును. కనుకనే బలరాము డిప్పు డాసంగతి నెత్తి తన్ను నెపపెట్టి మాటలాడినను జంకుగొనలేదు. నెమ్మదిగా సరస్వతీ తీర్థమునకు సాగనంపెను. ధర్మరాజుసంగతి యది కాదు. బలరాముఁడేపక్షము వాఁడగు సంగతియు ముఖ్యము కాదు. యుద్ధమున కనుమతించుటలోఁ దాను తొందరపడెనా యనుటయే యింకను బాధించుచున్నది. కాని బలరాముని మాటలవలన నా సందేహము పూర్తిగాఁ దీఱినది. సంధి కాకుండఁజేసిన వాఁడు శ్రీకృష్ణుఁడే యనుటయు వ్యక్తమైనది. పైగా, "హరి యెఱుఁగని చక్కటియును బ్రపార్థము గలదె" యనుటలో సర్వసందేహములు దీఱినవి. కనుకనే అతఁడును సత్కరించి సాగనంపెను. తననిశ్చయము సరియైన దన్న యుత్సాహముతో ముందడుగు వేసెను.

ఇంకొకవిషయ మున్నది. ఉభయపక్ష సైన్యముల నతిరథమహారథాది నిర్ణయము భీష్ముఁడు చెప్పఁగా దుర్యోధనుఁడు వినె నని తెలిసి, ధర్మరా జర్జునుని జూచి, "నీచేతం గౌరవబలంబు లెంతతడవునకుం దెగు" నని యడిగెను. అర్జునుఁడు చిఱునగవుతో - "ఏఁ గడఁగినన్ జూర్ణంబు గావింతు నొక్కొక్కని మేషంబున దేవదానవులతోఁగూడఁ ద్రిలోకంబులను" అని చెప్పి, పాశుపతాస్త్ర ప్రభావం బుగ్గడించి.- "దీనిని భీష్మాదు లెరుఁగ"రని పొగడి, "అట్టిఘోరసాధనంబున సమస్తంబు సమయించుట యుక్తంబు గాదు, తక్కినయాయుధంబులన పోరి వైరులం బరిమార్చినం బౌరుషంబు దీపించు"ననిపలికి, భీమసేనాదుల బల పరాక్రమాదులం బ్రస్తావించి, "అందఱం జెప్పనేల - నీయొక్కనికిం బ్రతిభువనంబు లెదురే? నీవు నిక్కం బలుగవు గాక-నీ వలిగిన నెవ్వ రెట్లయ్యెదరో యటుసూడుము" ఇత్యాదిగాఁ బ్రస్తుతించెను. ఇది యొకకార్యకర్త యడుగుటయుఁ జెప్పుటవలెఁ గాక యంతకంటె విశిష్టమైనదిగా నెంచి ధర్మరాజు మూఁపురము లుప్పొంగెను. కృష్ణునితో దైవబలము, పార్థునితోఁ బౌరుషము భీమసేనాదులతో నంగబల సర్వస్వము-ఇట్లు బహిరంతరావేశిత సర్వబలసన్నద్ధుఁడై ధర్మరాజు విజయశంఖము పూరించెను.

ప్రకృతములై ప్రాస్తావికములైన యొకటి రెండంశముల నిపుడు ముచ్చటింతును. శ్రీకృష్ణుఁడు కర్ణునితో నెల్లసంగతులు ముచ్చటించిన తరువాత యుద్ధము నిశ్చయింపుచు, "ఎల్లభంగులఁ బాండవులు గెల్తు-రది యట్లుండె. మీకుం దోడువచ్చిన రాజుల కందఱకుం జెప్పుము. ఆమ్మాసంబు

సౌమ్యంబై శీతోష్ణంబులు లేక, పుష్పఫలోపేతంబును, సమస్తధాన్యంబును, సులభయవసైంధవంబును నగుచు నొప్పియున్నయది. ఏడెనిమిది దివసంబులకు నమావాస్య వచ్చు నది పుణ్యదినంబు, నాఁడు ఖండనంబు గావలయు"నని చెప్పెను. ఏడెనిమిదిదివసములకమావాస్య వచ్చుననఁగా-నామాట లాడుదిన ము బహుళసప్తమి కావలయును. యుద్ధ మమావాస్యనాడు జరిగినచో అప్ప టినుండి పదిదినములు భీష్ముని యుద్ధము, తర్వాత ద్రోణయుద్ధమున నాలవ నాఁటి రాత్రి చీకటిలో దివ్వటీలుపట్టి యుద్ధము చేసిరనియు, నాతర్వాత చంద్రోదయ మెప్పుడో యయ్యెననియు గ్రంథము చెప్పుచున్నది. గ్రంథోదా హృతము సత్యమే కావలయును.అయినప్పుడు. చీకటిలో దివ్వటీలుపట్టి యుద్ధ ముచేయుటయు, ఎప్పుడో చంద్రోదయ మగుటయు బహుళచతుర్దశీ ప్రాంత మున జరుగుటచే, ఆ యుద్ధము బహుళ ప్రతిపత్తున సంగతమై యుండును. కృష్ణుఁడు చెప్పినరీతిగా శుక్లప్రతిపత్తునఁగాని బహుళఅమావాస్యయందుగాని జరిగియుండదు. పరస్పరవిరుద్ధమయిన యీ యంశము నెట్లు చెప్పెననునది ప్రశ్న:గ్రంథోదాహృతమును సత్యముగనే భావింపవలయుననియు, కృష్ణుఁడు చెప్పినమాటలలో, అప్పటికి యుద్ధము జరుగలేదు గనుక, అదిజరుగుటనూహిం చి, అందాజుగా 'ఫలానా'నాడు యుద్ధము జరుగునని చెప్పెననియు భావింప వలయును. కృష్ణుఁడు హస్తినాపురమునుండి యుపప్లావ్యమునకు వచ్చి ధర్మ రాజాదులతోఁజెప్పి యుద్ధము నిశ్చయించుటయు సైన్యాధిప, సర్వసైన్యాధి పాది నిర్ణయము చేయుటయు మొదలుగా నెన్నో కార్యకలాపములు జరుగ వలయును. అన్నిసన్నాహములు తీర్చుకొని ఎదురెదురుగా మోహరించుటకుఁ గనీసము పదుము దినములైనను బట్టవచ్చును. కావునఁ గృష్ణుఁడు చెప్పిన అమావాస్యాయుద్ధ మూహించినదే గాని యథార్థముగా జరిగినది కాదు. ఇఁకఁ గృష్ణకర్ణుల రహస్య సంభాషణముగూర్చి యొక్కమాట. ఆనాఁటి కది రహస్యసంభాషణమే. యుద్ధము ముగిసి ధర్మరాజు నివాపాంజలి యిచ్చువరకు రహస్యముగనే యున్నది. తర్వాత నది బహిరంగ విషయమైనది.తర్వాతగ్రంథ ములో నుదాహరింపబడి లోకమునకు వెల్లడియైనది. కర్ణుఁడు పెరిగి పెద్ద వాఁడై, కడపటి యుద్ధమున మరణించినంతవరకు కర్ణజననవృత్తాంతము రహస్యముగనే యుండుటయు, కృష్ణుఁడు దాని నట్లే యుంచుటయు- నది దేవరహస్య మని తెలియచున్నది.

ధర్మరాజు శంఖము పూరించుటతోఁ బాండవోద్యోగము చివరిదశకు వచ్చినది. ఉద్యోగమనఁగాఁ బ్రయత్నము. ఏపని చేయునపుడైనను, దత్ప్రయత్న ముద్యోగమనఁబడును, పర్వమనఁగా విభాగము. రాజ్యభాగము సాధించుటకై చేయుప్రయత్నము నుద్యోగపర్వ మని చెప్పుట యుక్తము. పాండవుల రాజ్యభాగలాభమునకై చేయుప్రయత్నము పాండవోద్యోగపర్వ మని తేలినది. 'ఆది - సభా-అరణ్య-విరాటపర్వము'లనునప్పుడుకూడ నీయర్థమే సరిపోవును. కాని, రాజ్యభాగలాభమునకై ప్రయత్నింపవలసినవారు పాండవులే యైనను, ఈ యుద్యోగమున నంతట నిలువు నేకదా పరిమళించినది శ్రీకృష్ణప్రభావము. ద్రుపదపురోహితునిఁ బంపుటమొదలుకొని-యుద్ధము నిశ్చయించి నంతవరకు సర్వాంతరముల శ్రీకృష్ణుఁడే విరాజిల్లుచున్నాఁడు కనుకఁ బాండవులరాజ్యలాభమునకై శ్రీకృష్ణుని ప్రయత్నముగాఁ దోఁచుట సహజము. కాని తావన్మాత్రమున నిది విశ్రాంతముగా లేదు. భూభారము తగ్గించి ధర్మము నుద్ధరించుటకై భగవంతుఁడు చేయుమహాప్రయత్నముగా నిది రూపొందినది. తప్పులు ఒప్పులు-నన్నియుఁ దనవిగాఁ-గానివిగా నటించి,చివరకు శ్రీకృష్ణుఁడు "నిమిత్తమాత్రం భవ సవ్యసాచి"అన్నట్లుగా రథమునడిపించినాఁడు,"గాండివంబు దీప్తులు మిఱుమిట్లుగొన్న కనుదోయి-గుణధ్వని ప్రయ్యలైనవీనులు" గా నరుఁ డా తేరిపై నరుగుచున్నాఁడుట. సంరంభము జూచుటకై యందఱు సందుచేసికోవలెను గదా!

ఈ యుద్యోగపర్వానువాదమునఁ దిక్కనగారితీర్పు చాలచిత్రమైనది. తక్కిన పర్వములయనువాదముకంటె విశిష్టమైనది. మూలమున నాధ్యాత్మికములు, నీతిబోధకములు, పూర్వకథా ప్రస్తావనలుగా నున్నవాని ననువాదమున నంటలేదు. అందుకొన్నను నామనిర్దేశమాత్రములుగా నుట్టంకించెను. కొన్ని శ్లోకములతో నున్నదాని నొకటిరెండు పద్యములుగా, కొన్నియథాతథముగా, అచ్చటచ్చటఁ బడియున్నవాని నేర్చి యొక పద్యముగా ననుసంధించెను. కొన్నిచోట్ల మూలమును పెంచి మెఱుగుపెట్టిన ఘట్టములు గలవు. ఆ విషయవివేచన మంతయుఁ బీఠికలో సూచింపఁబడినది. ఇప్పు డాయన సాహిత్యమునఁ గొన్ని మెఱుఁగులు చూపుట యుక్తము.

కావ్యతాస్ఫోరకముగనే గాక, సందర్భాలంకారములకై కూర్చినవర్ణనలు పెక్కులు. అవి యిట్లుండును. "తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు,

లన్నదమ్ములతో నిగ్రహంబు గొనుట కుమ్మలించి వివర్ణతఁ నొంది నట్లు గంది, యెంతయుఁ జెలువేదెఁ జందురుండు"-ఇత్యాదిగాఁ, జంద్రాస్తమయ,తారకోదయములు. చక్రవాక, శుకకోకిలభృంగవిహారములు, మలయానిలసంచారములు సూర్యోదయ సూర్యాతపప్రసారములు వర్ణించెను. "కలయట్టి వివిధార్థములు విశేషంబుగఁ దగ నొసంగుండు సత్పాత్రములకు" అని శ్రీకృష్ణుఁడు కౌరవుల నుద్బోధించి పలికినమాటలు, "కోల్పులివీకమై గొదగొని లేళ్ళకు నుఱుకు తెఱంగున దఱియఁజొచ్చి" ఇత్యాదిగా భీమసేనాదుల భుజాటోపవిజృంభణములు, "గాండీవగుణరవం బొండొండఁ జెలగంగ, శరపరంపర లాకసంబు గప్ప" నని యర్జునునియస్త్రపాండిత్యప్రాభవము, "అగ్నికుండమున ద్రోణాచార్యునకు నాశమొనరించు దానికై యుద్భవించె" నని ధృష్టద్యుమ్ను దొడ్డతనము; 'వక్షస్స్థలంబున వనమాల గ్రాలంగ వెలిమావు గెడలవాగెలు ధరించి' అని అర్జున సారథియగుకృష్ణవర్ణనము, "ప్రాణంబుతో గూడ రక్కసిచన్నుల పాలు ద్రావిన ప్రౌఢబాలుఁడితఁడె" యని పురస్త్రీలు గోపాలువర్ణించినఘట్టము- ఇట్టివెన్నియో యిందు నచ్చటచ్చటఁ దమయున్కి జ్ఞప్తి చేయుచుండును. శ్రీకృష్ణుఁడు ప్రాకృతమూర్తిగా మొదలై పరమార్థతత్త్వమువరకు వ్యాపించిన వివిధరంగవిన్యాసములును యథాశక్తి సంవేద్యములుగాఁ జెప్పుట యిందులో గొప్పలో గొప్ప. తెలుగుబాసకు నిండుదనము గండతనము కరగించి పోతపోయుటలో నితఁడు సిద్ధహస్తుఁడు. మహాకవియైనవాఁడు మహామంత్రిగా మనసుపండినలోకజ్ఞుఁడుగా నుండిన 'నిట్లుండు' ననుట యిందు ప్రతిపద్యమునఁ బ్రత్యక్షమగును. ఇంతయు తెలుగువారు చేసిన పుణ్యఫలమనుటలో నతిశయోక్తి లేదు.

తిక్కనగారి భాషాప్రాభవ మపూర్వమైనది. ఆంధ్రవిద్వల్లోకము వేవిధముల ముక్తకంఠముగాఁ గొనియాడినది. కొంచెముగానైన దానిని రుచిచూచుట యుచితము. తిక్కనగారి పదకోశమునఁ జేరి ప్రజావదనములఁ బారాడు పదప్రయోగము లిట్టివి:- వెసగలకాలరులు, వెలిపీడు, కొట్టినతిండికాఁడు, పవడించు, కొండుక, పల్లాయనంబువారు, ఒత్తోరువు, హోరాటము, అడియాసలు, కొఱతనుఱుకులు, పొంతువ, బెండు. వెడవెడయలుక, వాయోడు, కూటువమూఁక, పలిమాటలు, ముక్కునవావి, చావడము, వేరిమి, క్రొత్తది, కోరడము, వేసరి, వాయపురజ్జులు, గూఢచర్య, కడవఁబడు, ఉవ్వెత్తుకొను,

కవణము, లఘుసంచరణము, అడియరితనము, చక్కసగము, ఒట్టినమ్మంటలు, నమ్మిగ, చిడిముడిపడు, చిదురుపాలు, పీరమదము, పొనుపడు, ఆతల-ఇత్యాదులు:

తిక్కనగారి పదబంధవిన్యాసము లిట్టివి:- వారొకతల-నేనొకతల, నేల యెత్తికొన, పెట్టనికోట నీకు హరి, గొడ్డువోయిననారు, కుదుటఁగూడువెట్టి కుడుచువారు, చెవులు చీములుకట్టు, ధర్మసూతి మెత్తనిపులి, ఎరవయి నిల్చు, పఱివోదురు, చిచ్చయినఁ బిడికిలింతము, అరచేతికిఁ దేరఁజాలు, ముక్కూరి వగచు, కడకొంఅవులట్లు, ముకుఁద్రాటఁ గాలు గ్రుచ్చు, పుడమియెల్ల నొడ్డ గెడనయి, తోడు దొనలేని, బఱపికొనిపోయి, నీకై పొరలితిమి, ఒకచాలు వానిబలుతీర్పు, వెఱగునఁ బల్లవడు, ఒంటర మింటరములు, చీదకనుపడు, మీకథరము, విడిదలపయనములు, వెలలి బలరిపుఁడు, చిక్కనిపోటుమానిసివి, అరవాయిగొను, సరివింటివాఁడు, అది ప్రాప్తకాలంబు, ఉక్కుఁగలఁడు, గద నేర్పు ముసురుకవిసి, తిట్టుపాట్లు, పాములనెట్లట్ల, తూలపుచ్చు,అడుగు మాలి పోవు - ఇత్యాదులు.

తిక్కనగారి వాక్యరచనాచాతురి యిట్టిది:-మిముఁ జేరి నెగడువాడఁ, కారుణ్యమున నిట నరసియుండుఁడు, తానైన నపుడు నీతిపథము విడిచె - మమ్మైనననిపుడు చక్కని పథమున నడవుఁ డనె, పిల్లి పట్టిన యీరువు నేసియున్న, పీపు చక్కనయి నిల్చుఁగాక, నామోమున వ్రేలెదుగా, విరిగిన బారసాప వచ్చునే। వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగా,రథమురథము కదియ రానిచ్చి,దుఃఖములైనవి తెగుసమయము,మీమేనత్త నూఱడింపుము,పాలకడలి కడలిపాటయైయొప్పు, మొనతలఁబడు, భూమి యొనర్చి పాండునృపపుత్త్రుల కిత్తునె, ధర్మజవారిరాశికిఁ జెలియలికట్ట వాసె, పొట్టుపొరలయ్యెఁ గయ్యంబునాడుచు, ఉఱుకడకేగి తోడుపడు. ఇంతలేక యాడు మెల్ల వినఁగ, తిగిచి కొనివచ్చునెడ, అభిమతం బిదికాకయుఁ గల్గెనేనియుఁ బూని యెనర్తు, నెత్తురు నీరఁదేల్చు, కురుక్షితీశుఁ డను బ్రహ్మకు వేయును నిండు, సర్వకురు సంతతికిన్ గలవాఁడుకాఁడె, నామోమునన్ వ్రేలెదున్, విప్పచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దానుగా,అర్చిన మూరెడు నేర్పు, చేతులతీటం బుత్తుము, విచారవివేకంబుల నాయెత్తు వత్తురె, గాలియును జిట్టాడంగనీను, ఇది యిట్ల

య్యె(—దక్కినది యట్లుండె, మన(బోవకపోవ(గరాదు, కై వెక్కినట్టితల(వు, మాఱటనోరిదానను, ఒద్దియేఱు విడిసి, – ఇత్యాదులు పరశ్శతములు:

తిక్కనగారి యుపమానము–లర్థాంతరన్యాసము లిట్టివి:–మడుగు( జీర యందు మసిదాకినట్లు, మాకుం గుడు మిండు–మీరు వ్రక్క గొను(డు, రోష మయమహాతరువు–ధర్మతరువు, సాదు రేగెనేనింబోలతలమున( గాని నిలువ( బో(డు, పాలలో( బడిన బల్లివిధంబున,నిప్పులు వేడిమి సెడినట్లు, వింజం బాకి డినకరణి,విధిసేసినగతి( బడకయుండ శివునకువశమే, కొడం గనితగరు దా(క( గోరుట(గాదే, నిప్పులన్ బొరలినయట్లు, విసంబుచవి(గాలము మ్రింగినయట్లు, నీళుల నగ్ని పుట్టినయట్టిది, అట మిన్నందినవానిపొడ వెంతన్నట్లు, మంటలో మిడుత లుగ్రవృత్తి నుఱకదలచినట్లు,నేవోసినయగ్నిభంగి,కావిసెలయేఱుల తోడి నగంబులట్లు,పామున్నయింటిలో నున్నయట్లు, చిచ్చొడింగట్టినయట్లు, గజంబు గజంబు పల్లవం బల్లన తెమల్చులీల, (శ్రీ) రా మోకా లొడ్డినవాని విధము,—ఇత్యాదులు పెక్కులు.

తిక్కనగారి వ్యాకరణవిశేషము లిట్టివి:– సురరాజ్య(శ్రీ) వాలింప(గ, యోగక్షేమంబున తెఱ(గు, కాన తగంబొందుట, (ఇచ్చటకాన–కళ) కాన నవశ్యము(ఇచ్చట కాన్తద్రుతప్రకృతికము వేగ తెగంబాఱుకు(ఇచ్చట వేగకళ) జగంబులన్నిని, పోవ(గ(ద్రోతున్. (త్రోయుధాతువు) అట్టిదింగలదె,ప్రాణా నం గలుగంగ, సంధియ కావింపంబడిరి, మఱాకుమన్న, ఎన్నడేని కృష్ణుని తోడనే( జెప్పితి, భూరిశ్రమండతిరథంబుల మొదలి, జెట్టానజెట్లు, సుఖమున్న వారె, ఎల్లవెంట, సంభావింపుము విదురునితో.ప్రాణగొడ్డము,కూడదునార, బోనాలు వేర్పింప, చంపుదమ యిర్వురము, ఇత్యాదులు మఱియుంగొన్ని.

తిక్కగారి రచనలో రెండుమూడుప్రౌఢరచనావిన్యాసములు గూడ గన(బడును. చూడు(డు:– "ఒకటి గొని, రెండు నిశ్చలయుక్తి( జేర్చి। మూ(టినాల్గి(ంట( గడువశ్యములుగ( జేసి." "జ్ఞాతులపోరితమును, గోవ్రాత మునాక్రమము,విప్రవర్ణముచనవున్" "తుది రాజ్యమ్ము సగమ్ము గొ–మ్మద వియందున్ పేరు వంచించియున్, పదుమూడేడులు నీవునుం దిరిగి రా; పాలీ కపోవచ్చునే" ఇత్యాదులు దిక్సూచికాప్రాయములు.

రందఱకును సేమం బిట
ముందర లేకున్న, నేఁడు మొదలుగఁ గలుగున్. 283

క. ధృతరాష్ట్రభూపతికి వృ
ద్ధతకతమునఁ జిత్త మొకవిధము గామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడు, మనః
క్షతి పిదపం బుట్టి యిపుడు శాంతుం డయ్యెన్. 284

తే. ఇట్టి చందంబు లెల్లను నీవు పుణ్య
చిత్తవృత్తిమై సైఁచినఁ జెల్లివచ్చు,
నీ యజాతశత్రుత్వంబు నిఖిలలోక
విశ్రుతము గాదె ధర్మప్రవీణహృదయ! 285

చ. జగముల నెల్లెడన్ దురితసంతమసంబు జయింపఁగోరి పొ
ల్పుగఁ బరమేష్ఠి నిల్పిన వెలుంగు మహీసురు; లట్టివారికిం
దగవు ఘటింప సత్పురుషదత్తములై చను జీవనంబు; లెం
త గుమతులైన మార్తురె? పదంపడి యాయువు శ్రీయు నొల్లరే? 286

ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్పు, డాత్మలన్
నెక్కొని మోములం బొడము నెవ్వగతోడ జనంబు "లిట్టియం
దక్కట! భీముఁడైన మన యర్జునుఁడైనను, మాద్రిపుత్రులం
దొక్కరుఁడైన నీ పగలు నుక్కడఁగింపరె యొక్కఁ బ్రేల్మిడిన్. 287

క. వారొక యాగ్రహవృత్తిం
గూరి యధర్మంబు సేతకుం జాలరు; దు
ర్వారబలు లయ్యుఁ బాండుకు
మారులు శాంతాత్మ" లండ్రు మనుజాధీశా! 288

క. నలువురుదమ్ములు భవదా
త్ములుఁ గృష్ణుఁడు వినుచునుండ, భూవర! నీ కేఁ
గొలువునను విన్నవింపం
బలుకులు గల వవధరింపు పరిపాటి మెయిన్. 289

చ. అనవుడు, "వీరె తమ్ములును నాప్తులుఁ గృష్ణుఁడు, వీరె తక్కఁ గొ
ల్వునఁ గలయట్టి సర్వజనులున్ వినుచుండెద; రయ్య నిన్ను నే
మను మని పంచెఁ జెప్పు మదియంతయు నేర్పడ" నన్న ధర్మనం
దను గరువంపుఁ బల్కుల విధంబునకున్ మదిలోన నుల్కుచున్. 290

ఆ. సంజయుండు గృష్ణు సద్భక్తి నీక్షించి,
పవనపుత్రుఁ బార్థుఁ గవల ద్రుపద
తనయు సవినయమునఁ గనుఁగొని, ప్రీతిఁ బాం
చాలు మత్స్యధరణిపాలుఁ జూచి. 291

వ. సావధానులరై వినుం డని పలికి యుధిష్ఠిరుదెసకు మోడ్పుఁగేలు
నిగిడించి యిట్లనియె. 292

ఉ. "శాంతతఁ బొంది కార్యముదెసన్ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ న
త్యంతముఁ దేఱి నన్నిట ప్రియంబునఁ బంచెడునప్డు, నాకుఁ దే
రెంతయు వేడ్కఁ దాన వెర వేర్పడఁ జెప్పుచు బన్నఁబంచె; ని
ట్లెంత ఘటించెఁ బొందు; మన మీపదనం దెలివొందఁగాఁ దగున్. 293

క. చులుకని కార్యము సేయం
దలచుటఁ మీయట్టి సర్వధర్మజ్ఞులు శాం
తులు ననఁ బ్రసిద్ధు లగు పె
ద్దలకుం దగవగునె యెవ్విధంబునఁ జూడన్. 294

ఆ. మడుఁగుఁజీరయందు మసి దాఁకినట్లు మీ
సత్కులమునఁ గల్మషంబు గౌర
వేంద్రుకతనఁ బొందె, నింతయుఁ బాపంగ
నీవ నేర్తు కార్యనిపుణహృదయ! 295

చ. అఖిలజనక్షయం బయి, జయాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములు గాని యీపనికిఁ జొత్తురె యుత్తము లట్లుగాక యా
నిఖిలసుఖంబు లేమిటికి, నీ వని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ జంపితయేని దయాపయోనిధీ! 296

ఉ. పెట్టనికోట నీకు హరి, భీముఁడు నరునుఁడున్ రణంబునం
దొట్టినమంట; లాకొలఁది యోధుల సాత్యకియున్ విరాటుఁడుం
జుట్టపుమేరు వుగ్రరణశోభితుఁ డీద్రుపదుండు; నిన్ను ని
ట్ట ట్టనవచ్చునే సురలకైన-నొల్లవు గాక చివ్వకున్. 297

వ. మఱియు నక్కడ. 298

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లా సుయోధనుని పాలివ యంద్రు; నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్; సుతు లజేయులు; బాహ్లికసోమదత్తు లా
స్థాణునకైన నోడరు; వశంబె జయింపఁగ వారి నేరికిన్. 299

ఆ. అధిప! యిట్టి మీకు నన్యోన్యకలహంబు
నాకుఁ జూడ మే లనంగరాదు,
రెండుపక్షములకుఁ బ్రియము హితంబును
నాత్మఁ గోరువారి నడిగి చూడు." 300

వ. అని పలికి సూతనందనుండు గొలువు గలయం గనుంగొని. 301

ఉ. "మ్రొక్కెద వాసుదేవునకు, మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం,
దక్కటి మిత్త్రి బాంధవ హిత ప్రియ మంత్రి వయస్య కోటికిన్
స్రుక్కుచు విన్నవించెద; నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ
యిక్కరుణాకరున్ శరణ మే నిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్." 302

వ. అనుచుం బ్రణామపూర్వకంబుగాఁ బాండవాగ్రజు వదనంబునం జూడ్కి
నిలిపి "దేవా! యుపశమించుట లెస్స, యిమ్మెయికిం గురుపితా
మహుండును సంతసిల్లు, నాతనికి మతంబయినతెఱంగు సర్వలోకసమ్మతం
బగు" నన, విని ధర్మనందనుం డిట్లనియె. 303

ఉ. "నెయ్యము దప్ప నొండొకటి నీచెవి సోఁకెనె నాదుపల్కులం
దియ్యెడ సంజయా! యనికి నెమ్మెయి నక్కెదు నీవు? మాకుఁ దాఁ
గయ్యము దక్కి మన్కి తగుకార్యము గాదొకొ? పోరితంబు లే
కయ్యెడు నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొండు సేయునే! 304

క. జనులకు నెల్లను బథ్యము
లనఁగా, ధర్మానుగతము లగుననఁ బొగడం
జనుపనులు సేయు భీమా
ర్జునులే దుష్కర్మమునకు రోయనివారల్ ! 305

క. మది సుఖము గోరి, దుఃఖం
బొదవం గలకార్యములకు నుత్సాహము సే
యుదు- రొప్పనితృష్ణం బడి
చదు రేమియు లేనియట్టి జను లాతురులై. 306

ఆ. యోగ్యతృష్ణ దారు లుచి తంపుఁగొలఁదిమై
నడచినట్టివారు బెడిదములకు
నంత నొత్తు రెట్లు ? సంతాపకారుల
కాక, పెనఁకువలు సుఖంబు లగునె ? 307

వ. భోగంబులు వలదా యని తలంతుమేని. 308

తే. వస్త్రమాల్యానులేపనావసరములును
జతురతూర్యత్రయంబుల సమయములును
నేము వెలిగాఁగ మా తండ్రి కించు నెట్లు ?
పుత్రు లన వట్టి మమ్మేల పోవఁ ద్రోచు ? 309

వ. అయినను నొకమాట సెప్పెద, సమచిత్తుఁడ వై విను'' మని యిట్లనియె.

క. ''త్వాష్ట్రైన నపుడు శక్రుం
డై నీతిపథంబు విడిచె నక్కుటపతి; మ
మ్మైనను జక్కని తెరువునఁ
బూని నడవుఁ డనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్. 311

క. ఎదిరిం దమయట్టుల కా
మదిఁ దలఁచినఁ బొసఁగుఁ గాక, 'మాకుం గుడు విం
డిదె మీరె త్రొక్కఁ గొనుఁ' డని
చదు రడిచిన, మనసుపొందు చక్కం బడునే.'' 312

వ. అని చూపి చెప్పి వెండియు. 313

ఉ. "సంపద దక్కి యుండఁగ నశక్తు లనం జను మమ్ముఁ బిల్చి పూ
జింపఁగ నంత చేటె పతి? సెప్పెడువారలబుద్ధి నాఁడ మ
న్నింపఁడ; యింక నేల యగు; నీ వడియాసల వచ్చి రిత్తగా
రింపక మాను; మాతనిచరిత్రము నీకును మాకు వింతయే! 314

క. తగుమాట లాంబికేయుం
డగునని కైకొనునె యెన్నఁ డైనను; గొడుకున్
మగఁటిమి గలఁ డనియెడు న
మ్మిగఁ జూచుచు నుండు- విషము మ్రింగినయేనిన్. 315

క. 'జూదపుసిరి యాసపడం
గా' దని విదురుండు సెప్పఁగా, నప్పుడు క
ర్ణాదులపలుకులు విని, పతి
యాదరణము సేయకున్న నంతన తీరున్. 316

క. ధృతరాష్ట్రు డిటమీఁదను,
సుతులును శకునియును సూతసుతుఁడును- దను నే
గతి నడపించిరి, వారల
మతము యనుష్ఠించుఁ గాక, మరలం బడునే. 317

క. కార్యము తెఱఁ గిట్టిది; నీ
వార్యచరితమునకుఁ జొచ్చి యాడెదు; నీ కా
దుర్యోధను నవినయ మని
వార్యం బని యెఱుఁగరామివలనో! వెడఁగో! 318

క. చక్రధరు లెక్కగొనఁడు, ప
రాక్రమనిధి యర్జునునకు రాధేయభుజా
విక్రమ మెదురుగఁ గొని, ని
ర్వక్రముఁ జేసికొనువాఁడు రాజ్యం బెల్లన్." 319

వ. అని పలికి వెడవెడ యలుక వొడమిన మఱియు నిట్లనియె. 320

శా. "చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడు- దారు ము న్నెఱుఁగరే పో, రెట్లుఁ గయ్యంబు? లా
శాపాశంబులు చుట్ట లా వెఱఁగియుం జావేఁడి మార్కొందు; రిం
తేపో- తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే! 321

క. మును మమ్ముఁ బొగడి పదపడి
యని వారల గెలువ నరిది యని, పొత్తుగఁ జె
ప్పినమాటకు నే నొడఁబడ,
విను సంజయ! పక్షపాతవృత్తి విడువుమీ. 322

స్రగ్ధర. గాండీవజ్యారవం బుత్కట మయి పెలుచం గ్రమ్మినన్, భీముబాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్, వే
దండద్వంద్వంబు మాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినం, జా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్లకుండన్!

వ. కావున. 324

చ. రణములవారలన్ గెలువరా దను పల్కు లటుండ నిమ్ము. స
ద్గుణుఁడవు నీవు వచ్చితి, ప్రకోపశమంబుగఁ బల్కి; తింక సై
రణ దగఁ జేయువారము; పరాభవ మొందియు, మున్ను వారిదు
ర్గుణములు సైఁచు టీవు నొకకొంత యెఱుంగుదు వింతయేటికిన్. 325

ఉ. ఇంకను నట్లకాఁ దలఁపు, మే మొకకీడునకుం దొడంగ, మా
శంకలు దక్కుమయ్య! కువిచారము గల్గినయేని, బాంధవం
బంకురమొత్త, మావలన నక్కటికం బొలయంగ, మమ్ము నే
వంకకుఁ బోవనీక గరువంబు జగంబు ప్రసంశ సేయఁగన్. 326

క. రం డని పిలువఁబనిచి, పా
లిం డని కొడుకులకుఁ జెప్పి, యింద్రప్రస్థం
బొండెను వేఱొకపట్టణ
మొండెను మా కిచ్చి యనుచు టుచితమ కాదే!" 327

ఉ. నావిని సంజయుండు నరనాథున కిట్లను, "నెట్టి తప్పులుం
బోవఁగఁ ద్రోచి తాలిమియ పూనుదు గావున, నిన్నిమాట లి
ట్లీవు వినంగ నాడియును నేఁ దనివోవక విన్నవించెదన్
నీవిభవం బహింసయు ననింద్యచరిత్రమ కాక యన్యమే! 328

క. పాలీక కౌరవులు దు
శ్శీలతఁ గెడఁ దలఁచిరేనిఁ, జెప్పెద, రుధిరా
ఖీలాన్నంబునకంటెను,
మే లగు భిక్షాన్న మైన మీనడవడికిన్! 329

వ. అది యెట్లంటేని. 330

సీ. రాజసూయమహాధ్వరం బట్లు నడిపి,
సద్ద్విజులకు సురలకుఁ దృప్తిఁ జేసి,
శాంతియు దాంతియు సకలలోకంబులఁ
బొగడొంద బ్రదికిన పుణ్యమూర్తి;
నిట్టి నీచరితంబు హింసాకళంకిత
మగు టెంత యొప్పెడు? నదియుఁగాక,
దుర్ణయవృత్తి దుర్ద్యూతంబు పుట్టించి
యంతలు సేసినయట్టివారి

తే. నేల గర్వంబు సెల్లంగ నిచ్చి జగము
చేతఁ దిట్టులు వడునట్లు సేసి పోయి?
తేల యడవుల నిమ్మెయి నిడుమగుడిచి?
తేల తాల్మియ ధనముగా నింతవడితి? 331

క. తుదిఁ బోయి, క్రూరకర్మా
స్పద మగు తెఱఁగునకుఁ జొచ్చి, బంధుల గురులన్
వెదకి వధియించు సౌఖ్యం
బది యేటికి? నార్యవింద్య మస్థిర మరయన్. 332

తే. అల్లులకు మ్రింగ శేద్రైన హాలహలము
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ,
నీలగళు నెన్ని ని న్నెన్నఁబోలు, నట్టి
నీవు సాలినఁ గా, కేల నెగడుఁ బేరు?" 333

చ. అనవుడుఁ బాండురాజతనయాగ్రణి సంజయుమోముఁ జూచి యి
ట్లను, "నది యెల్ల నీ వలికినట్టిద, ధర్మువు లట్ల యుండి, బో
ధను లరయంగ వచ్చిన నధర్మము లై చెడుఁ గొన్ని, ధర్మవ
ర్తనములు గాక తోఁచి, తుది ధర్మములై చనుఁ గొన్నికర్మముల్." 334

వ. కావున నన్ను దూఱఁ దలంచితేని నాచేయునది 'ధర్మం బధర్మం' బని నిరూపించి మఱి దూఱుము; కోపంబు నివారింపం దగు, నహింసయ యుత్తమ ధర్మం బగు; నట్లయినను వంశదూషకులును లోకకంటకులును నగు పాపాత్ముల నిర్మూలంబుగాఁ జెఱచుట ధర్మం బని పెద్దలచేత విందు, మది యట్లుండె; 'సంగ్రామంబు రాజులకు ధర్మం బవుగా'దని నీవ చెప్పు; మట్లుంగాక, 'యిది కర్తవ్యం బిది యకర్తవ్యం' బని మనల శాసింప వాసుదేవుండు గలండు, మన కీవితర్కం బేటికి? నితండు ధర్మాధర్మ విదులకు గురుండు, గార్యాకార్యనిరూపకులకు శిక్షకుం, డుచితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుం; డితనిపంపునం గాదె యదుభోజాంధకవృష్ణి సంజయకేకయ ప్రభృతి భూపతిప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లుచున్నయది; విశేషించి మాకు నితనిబుద్ధియ సమస్తపురుషార్థమ్ములకు మూలం బగుట నితనివచనం బవశ్యంబు నలంఘనీయం" బనిన విని, జనార్దనుండు సంజయున కిట్లనియె. 335

ఉ. "పాండుతనూజకోటికి శుభం బెడఁగోరుదు నెప్డు, నాంబికే
యుండును బుత్రపౌత్రమహిమోజ్జ్వలుఁ, డక్కట! చేటు మేలె యం
చుండుదు; నట్లుఁ గాక తెలివొంది యతం డిట వీరిఁ దేర్పఁగా
నిండుమనంబుతోఁ బనిచె నిన్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్. 336

ఆ. నీవు నుచితవృత్తి నెయ్యంబు ధర్మంబు
వినయ మొప్పఁ దెలిపి, వీరు శాంతిఁ

బొందునట్టిభంగి పొసఁగఁ బల్కుటయును
నాకు సమ్మదం బొనర్చె నిపుడు. 337

ఆ. అనఘ! యిట్టు లంతయును దలఁపం గడు
నెనసినట్టు లుండెనేని, వింటె
పాండవాగ్రజన్ముపలుకులచందంబు
సూడ సంధిలేనిచొప్పు దోఁచె. 338

క. అది యట్టిద, సంధానము
దుది నెమ్మెయిఁ గల్గు నెట్లు? దుర్యోధనుఁ డు
న్మదుఁడు; ధృతరాష్ట్ర భూవిభు
హృదయంబు తెఱంగు గొంత యెఱుఁగుదుముగదా! 339

క. ఆరాజు సేయు నెయ్యము
గారామును జెప్పె దీవు, గడుఁ దీపులుగా
నీకు దమపాలు వడయక
నేరమి మాట లన తీర నేర్తురె చెపుమా? 340

ఉ. వీరలు పెద్దద్రవ్వ, కొకవెంట నొడంబడి, తేఱి శాంతులై
కౌరవకోటిఁ గూడి మనఁగా మదిఁ గోరుట పెంపుఁ దాల్మియుం
గారుణికత్వముం దగవుగాదె! జగంబున పాడిఁ దండ్రిపా
లీరని తెంపు సేసి పయినెత్తిన-నెత్తిరి గాక ద్రోహమే? 341

క. విను, మవమానము పడి యి
ట్లునికిఁ బడయు పొగరుకంటె, నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స; యెట్లయి
నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. 342

వ. 'సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గాదని నీవ చెప్పు' మని యుధిష్ఠిరుండు నిన్నడిగెఁ గదా! ద్విజాతులకు యజనయాజనాదికర్మకరణవిభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించునప్పుడు, రాజు లిచ్చువారు గాని, వేఁడుకొనువారు గారని చెప్పుట సకలలోకప్రసిద్ధంబు. సర్వవర్ణా

క్రమధర్మపరిపాలనంబు సేయునట్టి రాజులు దార నిజధర్మంబు వదలు దురా? యదియునుం గాక, పాడితోడి యార్జనంబునం దమకుఁగల కలిమి యనుభవించుచు, సత్పథంబున నడచుచుండఁ, ద మ్మొరు లన్యాయంబు సేసిన యప్పటికిఁ గదా యీశాస్త్రధర్మంబు లింద్రాదు లగు పెద్దలు గావించిరి; నీచెప్పెడి ధర్మంబులు గౌరవులకుం జెప్పవలదా? వారలు గదా మీఁ దెఱుంగక కొఱఁతనుఱుకులై చెడుతెరువునం బోయెడువా'' రని పలికి మఱియు నిట్లనియె. 343

క. నెట్టన సభలో, వేవుర
కట్టెదుర, నరాతితనము గా- కెంతయు వా
రెట్టితులువలో, ద్రౌపది
నట్టెల పఱిచెడిదె? జూద మాడరె యెందున్? 344

వ. అనవుడు సంజయుండు "దేవా! నీ చిత్తంబున నిడి దీని నింత గొని యాడినఁ గర్జం బొడగూడునే'' యనిన, వాసుదేవుం డిట్లనియె. 345

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగు నచ్చటి వృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూరకుండిరి మహీశ్వరుచిత్త మెఱుంగకున్కిఁ; దా
నొత్తి కుమారులం గినియ నోపఁడ; యక్కట! మాన్పఁ గన్న, నా
చిత్తమ కాదు, లోకముల చిత్తములెల్లను సంతసింపవే! 346

ఉ. తిట్టులఁబోయి యక్కొలువు తేఁకువవారలలోని, కింతిఁ దా
నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందల వట్టి యీడ్వఁగా,
నెట్టు సహించె మామ? సతియేడ్పుటెలుంగున కెట్టు లోర్చె? నీ
పట్టున సేమ మారయఁగఁ బంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మరన్? 347

చ. ఇది దగ దంచు నడ్డపడు నింతకు నేరక, సభ్యు లందఱున్
మది మరగొన్న యట్టియెడ, మానినికిం దనుఁ దాన కాచికో
లొదవిన దానఁ జేసి సభ నొచ్చెము దక్కెనఁ, బాండునందనుల్
బ్రదికిరి గాక; యయ్యెడరు రాజకుమారుల కోర్చునట్టిదే? 349

వ. సంజయా! వినవే యప్పుడు సభాసదులకుఁ గర్ణశూలంబు లగునట్లుగాఁ
గర్ణుండు. 349

క. 'లే రిచట మగలు నీకును
వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నుఁ;
వారిజలోచన! నీపైఁ
గూరిమి గలమగని వెదకికొను మొరు'- ననఁడే? 350

క. నరునకు నది వాఙ్మయ మగు
శరమై హృదయంబు నాఁటి చలియింపక దు
ర్భరవేదనఁ జేయంగాఁ,
చిరకాలము దచ్చికిత్స సేసెనె చెపుమా? 351

వ. మఱియు దుశ్శాసనుండు 'వీర లందఱును గొడ్డువోయిన వారలు, పౌరు
షంబు గల మానిసి యిం దెవ్వం' డనియె. నతని చెప్పినట్ల పెద్దగాలం
బేని వీరల గొడ్డువోయిరి గాక వీరిదెస వారికి నేమి ఫలించె? వెండియుఁ
దత్సమయంబునఁ బుట్టిన మాట లుగ్గడించునట్టివి గా, వీసంధికార్యం
బత్యంతదుర్ఘటంబు. దీని ఘటియింపంజేయుట యశక్యం బని తలంచెద.
నయినను. 352

సీ. పాండవేయులఁ దగం బ్రార్థించి, యందుల
కక్కట యేనైన నరుగుదెంచి;
కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి, రాజ్యంబు
పాలు సేసిన, మృత్యుపాశములకుఁ
దప్పరే వారలు; దగవును నేర్పును
నామీఁద నిలుచుట నాకుఁ గీడె;
నన్ను మన్నింతు, రన్యాయంబు సొరని నా
మాటకుఁ దా రొడఁబాటు లేక

తే. యుండుదురె? కేరడము లాడుచుండిరేనిఁ
గవియు పాండవబాణాగ్ని గాదు సువ్వె,

తమ్ముఁ దమ లోభ మను చిచ్చు దరికొనంగఁ
దెగినవా రయి పోదు రింతియ తలంప." 353

వ. అని పలికి వెండియు నిట్లనియె. 354

ఆ. "రోషమయ మహాతరువు సుయోధనుఁ, డురు
స్కంధ మందులోనఁ గర్ణుఁ, డలరుఁ
గొమ్మ సౌబలుండు, గుసుమఫలములు దు
శ్శాసనుండు, మూలశక్తి తండ్రి ! 355

ఆ. ధర్మజుండు ధర్మతరు, వర్జునుఁడు ఘన
స్కంధ, మనిలసుతుఁడు శాఖ, కవలు
పుష్పఫలము, లేను భూసురులును వేద
ములుఁ దదీయమైన మూలచయము. 356

క. ఈ రెంటియందు నరసి, 'య
సారం బిది, గాఢసారసహితం బిది' నా
నేర వలయు; నదియును గా
కేరూపం బయ్యెనేని నీ సేమిటికిన్. 357

మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనము, గుంతీనందనుల్ సింహముల్,
మతి నూహింప ససింహమైన వనమున్ మర్దింతు రెందున్; వనా
వృతవృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందుఁ; గా
న తగం బొందుట కార్య మీయుభయము న్సంతుష్టిమై నున్కికిన్. 358

క. పరిచారకు లై యుండుదు
రరివర్గవ్యతికరమున కగుదురు, వీరిన్
సరిఁ దనకొడుకుల మెలపిక
తెరువున మెలఁగింప వలదె ధృతరాష్ట్రునకున్ ? 359

క. ఏ నీ పనికై వచ్చెదఁ
దా నొప్పఁ దలంచె నొండెఁ దప్పం దలఁచెన్

దానన నెగడెద మే, మ
మ్మానవనాథునకుఁ జెప్పు మామత మెల్లన్.'' 360

వ. అనిన విని సంజయుండు ధర్మతనయుం గనుంగొని ''యట్లయినను గడు లెస్స గదా! దేవా నా వచ్చినకార్యంబు సఫలం బయ్యెఁ, బనివిని యెద'' నని వాసుదేవునకు నట్ల విన్నవించి, భీమార్జుననకులసహదేవ సాత్యకి ద్రుపదవిరాటుల నీక్షించి, 'మీ యందఱచేత ననుజ్ఞాతుండన కదా పోయివచ్చెద' నా యాడిన మాటలయం దేమియుం దగనియట్టివి లేవుగదా'' యనుటయుఁ, బాండవాగ్రజుం డతని కిట్లనియె. 361

ఆ. పోయివత్తుగాక ! యీ యున్న యందఱు
వినఁగ నాడి తీవు విశదభంగి,
నొక్కమాట యైన నుచితంబు గానిది
గలదె ? యి ట్లనంగ వలయు నెట్లు ? 362

క. ఎదు రున్నరూపు వలుకఁగఁ
దుదిఁ గటకటఁ బడవు నీవు, దుర్ణయమును జె
ట్టిదమును బెండును నగు పలు
కొదవదు నీ నాలుకకు- నయోన్నత యెపుడున్ ! 363

క. నీ వొండె విదురుఁ డొండెను
గా వలయుంగాక, యిట్టి కార్యంబులకుఁ
రా వేఱ కలరె తగువా;
రీవినయము నేర్పు గలదె యితరుల కెందున్ ; 364

చ. అరిగిన యప్డు పెద్ద లగు నందలివిప్రుల నెల్లఁ గాంచి యా
దరమున వారి సేమ ముచితంబుగ నారసి, వెండి కాన్పు మీ
గురునిఁ బితామహుం గృపునిఁ; గూర్తురు వారలు నాకు; నా నమ
స్కరణము గాఁగ వారి కధికప్రియభక్తి నమస్కరింపుమీ ! 365

సీ. మాతండ్రిఁ గని, యేను బ్రీతి మ్రొక్కుట గాఁగ
దండప్రణామంబు దగ నొనర్పు;

దుర్వృత్తిఁ బొరయు నాదుర్యోధనుని సేమ
మడిగితి నని చెప్పు; మతనితమ్ముఁ
డగుటకుఁ దగియెడు నాదుస్ససేనుని
కుశల మారయుము; దక్కను గుమార
వర్గంబు నెల్లను వనితాజనంబుల
నుచితంపుమై సుఖ మునికి యడుగు;

ఆ. విదురు శల్యుఁ గాంచి వినయంబు దోఁపంగ
నాడు, ద్రోణతనయు నక్కు సేర్చి
కొంటి ననుము, బాహ్లికుని సోమదత్తు భూ
రిశ్రవసునిఁ దెలఁచి ప్రియము నెఱపు; 366

వ. మఱియు వంశవంతులు వయోవృద్ధులు నగు భూపతులను, గృతవర్మను గర్ణ శకుని సైంధవ ప్రభృతులను, దక్కటి రాజలోకంబును, గయ్యంబు నకుఁ దోడు వచ్చిన సకలదేశాధీశులనుం గని, యెవ్వరితోడ నెవ్విధం బునం బలుకం దగు బ్రణామవినయబాంధవమైత్రీవాత్సల్యంబులకు నయ్యైప్రకారంబుల మద్వచనంబులుగాఁ బలికి యుచితంబు మెయి నుపచరింపుము. 367

క. దాసీదాసజనముల కు
దాసీనము గాకయుండఁ, దడయక యే మి
త్త్రాసంగ మొంది శత్రుని
రాసం బొనరించి తమ్ము నరసెద ననుమీ ! 368

క. పోయిన మొగమున నచ్చటఁ
జేయుతెఱం గెల్ల నీకుఁ జెప్పితిఁ; బిదపన్
మాయయ్య పెద్దకొలువున
వా యోడక యిట్లనంగవలయుం జుమ్మీ. 369

చ. అనఘ ! భవద్బలంబునన యాపద యించుక లేక పాండునం
దనులు నిజాప్తబంధుసహితంబు సుఖస్థితి నున్నవారు; త

జ్జనకుని రాజ్యపీఠమున సమ్మద మొందఁగ నిల్పి శైశవం
బునన ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితి వారల విశ్రుతంబుగన్. 370

ఉ. ఇప్పు డుపేక్ష సేసి, కృప యేమియు లేక, విహీనవృత్తి- వా
రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పునె! యింతట సంతసింప రా,
దిప్పుడు నంత కంత నట యెక్కుడు గోరినఁ జాలకుండదే!
యొప్పదె కూడి మన్కి- మన కొప్పనివారలయుక్కు దక్కఁగన్." 371

వ. అని, తదవసరంబునం బితామహుతో నిట్లనుము. 372

చ. అడఁగఁగనీక శంతనుని యన్వయముం గలిగించి తీవ; యి
ప్పుడు దగ నీమతంబునన పొం దొడఁగూడఁగఁ జేర్చి, పౌత్రులన్
సడికి నధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మన్పినం,
బుడమి జనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే?" 373

వ. అని పలికి వెండియు. 374

క. "ఇంతలు వుట్టినచోటను,
శంతనునందన! యహీనశాంతిపరుం డై
కౌంతేయాగ్రజుఁ డాలము
పొంతం బో నొల్లఁ" డనుము బుధు లియ్యకొనన్. 375

సీ. ఆసమయంబున నచ్చటివారెల్ల
        వినునట్లుగా, సుయోధనునితోడ
"బాహుబలాఢ్యుల బలవిహీనులక్రియ
        వెడలంగ నడచిన వెఱ్ఱితనము,
నత్యంతచిరకాల మడవులఁ గొండల
        బాధలఁ బెట్టిన పరుసఁదనము,
సభలోన నట్లు పాంచాలరాజాత్మజఁ
        దలవట్టి యీడ్చిన తులువతనము,

తే. ధర్మపుత్త్రుండు సైరించెఁ; దథ్య మీవు
కురుకుమారుల నని మ్రింగికొనకు; మొరుల

సొమ్మునకు నాసపడం దగ, దిమ్ము వారి
పాలు; వారలతోం గూడి బ్రదుకు''-మనుము. 376

వ. ఏము కలహం బొల్లక పొందు గోరుట తనకు మేలు; ధనమదంబున దరికొను తృష్ణానలం బార్ప నొరు లర్థంబు హరమింజేసి యేన బుద్ధి సెప్ప వలసెం; దనయొద్దం గల యోధవీరు లెయ్యెడల నేమి దెల్లంబయినను మాకుం జేదోడు ధర్మంబు గలః దదియునుంగాక, యఖిలలోకసేవితుం డైన కృష్ణుండు పెనుంబ్రాపు గావునం దమకు మమ్ము గెలువం గొలంది గాః దది యట్లుండెః నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాండ నగుట వీరును వారును మదీయప్రార్థనాభంగంబు సేయక నాదగు శాంతియు దాంతియుం జెల్లించి నన్నలజడిం బెట్టక పోరితం బుడిగి తమతమధనంబులు గుడిచి సుఖం బుండుట మనపెద్దలకుం దక్కటి బుద్ధి మంతులకును సంతోషం బగుం; బెద్ద యీనోపండయ్యెనేనిం, గుశస్థలంబును వాసంతియు వారణావతంబును జాలుం- గాదేని మఱియు నెందేని నొక్కటి యగునట్లుగా దనతోడంబుట్టువు లేవురకు నిలువ తావు లయి దిచ్చిన సర్వశాంతి యగు; నట్లయినను నిందలి యందలి బంధుమిత్త్రి సహాయజనంబులు గలసి నవ్వుచుం దెగడుచు నునికి మనమనంబులకుం బ్రియంబు సేయు; గురుపాంచాలయాదవమాత్స్యులు పరస్పరప్రీతి సంపాదకత్వసంపన్నులై బ్రదుకుట నాకుం గోర్కి; యింతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పు" మనిన, విని "దేవా! నీయానతిచ్చినమార్గం బంతయు నడపెద, మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకును నెట్లు ప్రియం బట్లు సేయువాండ కాక" యనుచుం బ్రణామంబు సేసిన సంజయునకు ధనంజయుం డిట్లనియె. 377

క. "బాలసఖుండవు నాకును
నీలెస్సందనంబు; నేము నీతి విడిచి దు
శ్శీలుర మగుటయు శైశవ
లీల మొదలు గాంగ మును దెలియదే నీకున్. 378

మ. బలమత్తాకృతి యైన భీముఁడును శుంభత్కుంభిసంరంభమున్
నిలిపెన్ నాఁడును సంకుశం బయి, తుదిన్ నేఁడుం దదుద్రేకమున్
మలుగం జేయ నజాతశత్రుని కృపామౌగ్ధ్యంబు చాలంగ, వా
రల కేలా నయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా!" 379

వ. అని పలికి ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సముచితప్రకారంబున మజ్జనభోజనంబు లొనరించి, మాల్యానులేపనాద్యుపచారంబులు సేయించి, మణిభూషణచిత్రాంబరంబు లొసంగి వీడుకొల్పిన నతండును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియె నని చెప్పిన. 380

క. విని, యత్యంత కుతూహల
మునఁ బొదలుచు, "సంజయుండు మున్నెచ్చటికిం
జనియెను, నెవ్వరితో నే
మనియెను వినవలతు మునిజనాధిప చెపుమా." 381

వ. అని యడిగిన. 382

ఉ. భూరికృపానుషంగ! మునిపుంగవచిత్త సరోజభృంగ! సం
సారదవ ప్రవర్ష! సురసంస్తుత దివ్యగుణ ప్రకర్ష! దో
స్సార నిరస్తదైత్య! శమశాలి మనస్థ్సితనిత్య! లోకని
స్తారకశీల! నిర్వృతివిశాల! నిరంజన! పాపభంజనా! 383

క. శ్రుతిమౌళిరత్నమూర్తీ
శతధృతి ముఖపద్మషండ సౌరభకీర్తీ
రతిపతిహితాహితాజ్ఞా
సతతసమాచరితభక్తజనసంరక్షా. 384

మాలిని. సదయవిమలదృష్టీ! సంశ్రితాశీః ప్రవృష్టీ!
హృదయకమలవాసా! యిద్ధమాయావిలాసా!

విదితనిఖిలభూతీ! విశ్వరక్షాత్తహేతీ!
సదసదుపచితాత్మా! సంభృతానందవర్త్మా! 385

గద్యము :

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి
బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి
ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున
యుద్యోగపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము - ద్వితీయాశ్వాసము

క. శ్రీ విస్తార కరణ కరు
ణావేశోదార ! శశ్వదమలాకారా !
భావవికారవిదార ! శు
భావహనామప్రకార ! హరిహరనాథా ! 1

*-: సంజయుండు ధర్మజుని సంధిపల్కులను ధృతరాష్ట్రునకుఁ దెల్పుట :-*

సం. 5-32-1.

వ. దేవా ! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె, నివ్విధంబున వీడ్కొని సూతనందనుండు పవనజవంబు లగు నరదంబుతురంగంబులం దఱిమి ప్రొద్దుగ్రుంకునంతకుం గరిపురి సొచ్చి, నగరి కరిగి యంతఃపురంబున నున్న ధృతరాష్ట్రునకుం దనరాక యెఱింగించి పుచ్చి, యతనిం గాంచి యడుగుల కెఱఁగిన, నమ్మహీవరుండును నత్యాదరంబున నెత్తి సమీపంబున నునిచినం గొలిచియుండి చేతులు మోడ్చి యిట్లనియె. 2

ఉ. "దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిం గని వచ్చినాఁడ, నా
భూవిభుఁ డప్రమేయగుణపూజ్యుఁడు- మీకు నమస్కరించె, సం
భావనసేసె నా, కిచటిబంధుల నెల్లఁ దలంచె; మీసుఖ
శ్రీ విభవంబులుఁ సుతులసేమము నన్నడిగెం బ్రసన్నుఁడై." 3

తే. అనుఁడు ధృతరాష్ట్రుఁ డిట్లను, "నయ్యజాత
శత్రునకు సేమమే ! యనుజన్ములెల్ల
సుఖులె ! బంధులు భృత్యులు సఖులు మంత్రి
వరులు సంప్రీతిమెయి నున్నవారె యచట." 4

వ. అనిన సంజయుం డిట్లనియె. 5

క. "వారెల్లను భవదీయ
స్ఫారబలము గారణముగ సౌఖ్యంబున ను
న్నార మని పలుకుదురు; నిజ
మారయఁగా నట్లకాదె యది జననాథా !" 6

క. ధర్మజునకు భోగంబులు
ధర్మమున ట్లింపఁగావు; ధర్మంబులలో
నిర్మలబుద్ధి నహింపకుఁ
గూర్మి గడుం గలఁడతండు, కురువంశనిధీ ! 7

ఉ. మానుషశక్తి యొల్లఁడు, సమంచిత దైవమ యూఁదియుండు, నీ
పైన యతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు; నీవు నీ
సూను వశంబ కాని యొకచొప్పుఁ దలంపవు; కర్ణసౌబలా
ధీనము కార్యనిశ్చయము తెల్లము; నీమత మొప్ప దేమియున్ ! 8

ఆ. ఆలుబిడ్డ లేనియట్టి త్రిమ్మరి యగు
కొయ్యగాక, కుదుటఁ గూడు వెట్టి
కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ
జొచ్చు టిచ్చగించి చూతురయ్య ! 9

చ. కొడుకులఁ గానరే నృపు లకుంఠిత తేజుల నెందు; నిమ్మెయిం
జెడు తెరువైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే !
పుడమిజనంబులెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ వించునుక్కి నొ
చ్చెడు మది యెప్పుడుం; జెవులు చీములు గట్టెడుఁ, గౌరవేశ్వరా ! 10

చ. చలమున దుస్ససేనుఁడును సౌబలుఁడున్ మిముఁ బట్టి యార్వ, బొ
మ్మలక్రియ నాడుచుందురు మానక నీవు సుయోధనుండుఁ, దా
రలసి యొకప్డు పాండుసుతు లాగ్రహవృత్తికిఁ జొచ్చిరేని, నీ
చలము బలంబునుం గులముఁ జక్కగఁ జేయరె యొక్క వ్రేల్మిడిన్. 11

క. వినుము, యుధిష్ఠిరునైరణ
మనవారలు వెలవుగా సమర్థింతురు– డీ

కొనఁగం దగరే కొండం
గని యోటమి వెట్టినట్లు; కౌరవనాథా ! 12

క. అనుజులకు నడ్డపడి, యే
మిని జేయఁగనీమిఁ జూచి మెచ్చితిగా కీ
వును; సాదు రేఁగెనేని
న్నిను తలపొలమునన కాని నిలువదు సుమ్మీ ! 13

చ. అనయము పుట్టె జూదమున యప్పుడ; యెంతయుఁ జిచ్చువెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ; వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి; యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం; బిదప నీకును నాకు మరల్పవచ్చునె ! 14

చ. అనయము నొచ్చుచున్నయవి యంగము లెల్లను వేగ వచ్చుట;
స్నానము వేళంబు గాదు; జననాయక ! ప్రొద్దును బోయె; నిప్పు డేఁ
బనివిని రేపు పుత్రులును బంధులు నాప్తులు నీవు సేర్పఁదగ
విన, మన కార్యమంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్.'' 15.

ఆ. అనిన, నట్లకాక యని సంజయుని వీడు
కొలిపి, కొంతప్రొద్దు కురువిభుండు
కార్యచింత మునిఁగి, కంచుకి నొక్కరుఁ
బిలిచి వేగ విదురుఁ బిలువు మనియె; 16

వ. వాఁడును సత్వరంబుగాఁ జని యతనిం దోడ్తెచ్చి కాన్పించిన, నమ్మహీ
వరుం డత్యాదరంబున దనయొద్ద నునిచికొని, యతని కిట్లనియె. 17

ఆ. ''పాండురాజసుతులపాలికిఁ జని, యిప్డు
సంజయుండు వచ్చి సమ్ముఖమున
నన్నుఁ జాల దూఱి, నాకు రే పచ్చటి
పనులు సెప్పువాఁడ ననుచుఁ, జనియె. 18

క. అప్పటినుండియు నెవ్వగ
గప్పికొనినఁ, జిత్తవృత్తి గలఁగెడు; మేనున్

నిప్పులఁ బొరలినయట్లయి
చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా !" 19

వ. అనిన విదురుం డిట్లనియె. 20

క. "బలవంతుఁడు పై నెత్తిన
బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, ద్రిము
చ్చిల వేచువాఁడు, గామా
కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా !" 21

క. ఇక్కొక్కఁ జగాములలోపల
నొక్కటి నీచిత్తవృత్తి నొందెనో ! యొరు సొ
మ్మొక్కటి గుడువఁ దలంచితో !
నిక్కము గత మేమి సెపుమ నిద్ర చెడుటకున్. 22

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోడ
"ధర్మసుతుమాటచొప్పవ్విధంబొ యెఱుఁగ
కునికిఁ జేసి చింతిల్లితి; నోవు దీవు
దెలియఁ జెప్పి నాయలమట మలుగఁజేయ." 23

చ. అనవుడు నిట్లనున్ విదురుఁ, "డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును చెలికాఁడునుం దగుభటుండును బ్రెగ్గడయున్ గురుండుఁగాఁ
డె ! నృపవరేణ్య నీకుఁ ! బ్రకటీకృతసత్యుఁడు, శాంతమూర్తి, స
ద్వినయవివేకశీలములవిశ్రుతుఁ- డాతఁడు గీడు వల్కునే ! 24

ఆ. నీవుఁ గొడుకు వారి నెఱిలేక పఱిచితి,
రదియ చాలు, నుచితమైనపాలు
పంచి యిందు, పిల్లి పట్టిన యూరువు
సేసి యున్న-నేల చెల్ల నేర్పు ? 25

వ. మీరు శకుని కర్ణ దుశ్శాసనులమీఁద రాజ్యభారంబు వెట్టుకొని యుండుదు,
రిది తుదిముట్ట నేర; దెట్లంటేని. 26

క. తముఁ దా రెఱుఁగుట, వేగప
డమి, దాలిమి, విడుపుగలుగుటయు లేని ప్రభు
త్వము గలదె? వారియం దీ
సుమానుషము లోకుఁడుఁ బట్టి చూడంగలఁడే? 27

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కమ తండ్రి వని తగవు నమ్మి చాల సైరించి యున్నవాఁ, డది నీవ యెఱుంగు" దనిన, విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 28

తే. సంజయునిచేతఁ గార్యంబుచంద మెల్లి
యెఱిఁగి, మన కెద్ది సేయంగఁ దెఱఁగు దానిఁ
బనిచి చేయింపు; మిపుడు నామనము తల్ల
డిలుట హితభాషణంబుల డిందుపఱుపు. 29

వ. నీవు ధర్మాధర్మవిదుండవు, నయానయజ్ఞుండవు; నాకుం బ్రజాగరం బొనర్చుచున్న సంతాపం బుపశమించునట్లుగా, భవద్వచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొల్పు" మనిన, విదురుం డిట్లనియె. 30

-: ధృతరాష్ట్రునకు విదురుఁడు హిత ముపదేశించుట :-

సం. 5-33-16.

క. "జనులకు నొడఁబా టగు విధ
మున నడచుచు, లోకనింద్యముల నుడుగుచు, మీఁ
దని యొకనికలిమి కులుకక,
మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా! 31

క. కోపము నుబ్బును గర్వము
నాపోవక యునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము నను నివి
కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా! 32

క. ఏలినవానిని, దైవము,
నాలిని, బంధులను, సముచితారాధన ఫం

శీలతఁ బ్రీతులఁ జేయని
పాలసుఁ డాఫలము లాసపడు మనుజేంద్రా! 33

క. నెమ్మి గలవారి నొల్లరు,
త మ్మొల్లని వారి వెనుకఁ దగులుదు, రధిక
త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు,
రి మ్మెఱుఁగని యట్టివార లిభపురనాథా! 34

క. ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ బొనరించును, స
జ్జనులైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా! 35

క. అరిది విలుకాని యుజ్జ్వల
శర మొక్కని నొంచుఁ, దప్పి చనినం జను; నే
ర్పరి యైన వాని నీతి
స్ఫురణము పగరాజు నతనిభూమిం జెఱుచున్. 36

తే. ఒకటిఁ గొని, రెంటి నిశ్చల యుక్తిఁ జేర్చి,
మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి,
యేనిటిని గెల్చి, యాఱిటి నెఱిఁగి, యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు." 37

క. [illegible]ను మధురాహారంబులు
గొనుటయుఁ, బెక్కండ్రు నిద్రగూరినయెడ మే
ల్కని యునికియుఁ, గార్యాలో
చనముఁ, దెరవు నడుచుటయును జన దొక్కనికిన్. 38

క. నడవడి యను మున్నిటిం
గడవం బెట్టంగ నోడకరణిం దగి, తా
నోడఁగూడు ననిన, సత్యము
గడచిన గుణ మింక నొండు గలదే యరయన్. 39

క. క్షమియించువారిఁ గని చా
లమి వెట్టుదు, రైననుం దలంప ననూన
క్షమయ కడు మెఱయు తోడ; వు
త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్. 40

క. పురుషుండు రెండుఁదెఱఁగుల
ధర నుత్తముఁ డనఁగఁ బరగుఁ: దా నెయ్యెడలం
బరుసములు వలుక కునికిన్,
దురితంబులు వొరయు పనులు దొఱఁగుట కతనన్. 41

తే. చెల్లియుండియు సైరణ సేయు నతఁడుఁ,
బేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గల భంగి నిచ్చు నతండుఁ- బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య. 42

ఆ. పాడి దప్పకుండఁ బడయు సొమ్ములకు న
పాత్రములకు నీగి, పాత్రములకుఁ
బెట్టకునికి, యనఁగ నెట్టన రెండు వి
ధములఁ గీడు తొడరు ధరణినాథ! 43

తే. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబుఁ బరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల. 44

తే. తగిన వేషంబు, దనుఁ దాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ
కునికి, దన కెంత నడవకయున్నఁ బథము
దప్పకుండుట- నడవడి కొప్పు సేయు. 45

క. చెలిమియు, సంభాషణమును,
బలిమి వివాదంబు ద్రోపుఁ బాడియు, దమయం

తలవారి తోడ దగు; సధి
కుల హీనులతోడ నైనఁ గొఱగా దధిపా! 46

తే. కొంచె మైనను దగఁ బంచి కుడువ మేలు,
జనులకెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము; శత్రునకు నైన
నిచ్చుటయ లెస్స యడిగినయెడ, నృపాల! 47

క. తను లోకము గొనియాడఁగ,
విని యుబ్బఁడు సజ్జనుండు, వెండియుఁ గడుమే
లొనరించుఁ; గీ డొకించుక
యును దనదెసఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్!

వ. ఇట్టి చందంబులు ధర్మనందనునకుం గల"వని పలికి, విదురుం డది ప్రసంగంబుగాఁ బాండవులఁ బ్రశంసించి, "నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి, యిప్పు డుపేక్షించి వారలు వెలినుండ నూరకుండం దగునే! తగు పాలిచ్చి, వారి రావించి నీకొడుకులతోడివారింగా నడుపుట యుచితంబు; మీరును వారును నొక్కటియై యున్న, మీదిక్కు దేవతలకుం దేఱిచూడరా" దనిన, నమ్మాటలు వెడవెడ యూఁకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె 49

తే. "హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగు దీవ,
ధర్మసుతుచందమును విదితంబు నీకు,
నట్లు గావున నెఱిఁగింపు మఖిలకార్య
జాతమును జిత్తతాపోపశమము గాఁగ"— 50

క. అనుడు విదురుఁ డాతని కి
ట్లను, "నిమ్మెయి నన్ను నొత్తి యడిగినఁ జెప్పం
జను; నున్నరూపు సెప్పెద
విను, మవధానంబుతోడ విమలవిచారా! 51

ఉ. దక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్మునిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁజూచె దది యెట్లరుగున్; విను, మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు సూవె; యి
ట్లుక్కివుఁ డైన నీకొడుకు నుల్లము నున్నటు లాడఁగూడునే!” 52

క. అన విని నిరుత్తరుం డయి,
మనుజేంద్రుఁడు గొంతసేపు మ్రాన్పడి, తలఁపుల్
పెనఁగొన, నిద్రాహీనిం
దను వలయఁగ, విదురుతోడఁ దా నిట్లనియెన్. 53

క. “ఇందాఁక నీదుపలుకుల
డెందము తాపంబు గొంత డిందుపడియె; నా
కుం దగ నయానయంబుల
చందంబులు సెప్పుచుండు సౌజన్యనిధీ!” 54

వ. అనిన విని విదురుం డిట్లనియె. 55

ఆ. “తనియఁ బండకుండ మును గోసికొనఁ, జవి
చేఱు కాదు విత్తుచేటుఁ గలుగుఁ;
బక్వ మైనఁ గొనిన, ఫల మించుఁ– జెడదు బీ
జంబుఁ; గార్యసిద్ధి చంద మిట్లు” 56

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ, దేఁటి
పువ్వుఁదేనియఁ గొనియెడు పోల్కి, నెదురు
గందకుండఁగఁ గొనునది కార్యఫలము;
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁ జనదు! 57

క. పరులధనమునకు, విద్యా
పరిణతికిం, దేజమునకు, బలమునకు మనం
బెరియఁగ, నసహ్యపడు న
న్నరుఁడు దెవులులేని వేదనం బడు, నధిపా! 58

క. ఎదిరికి హితమును బ్రియమును
మది కింపును గాఁగఁ బలుకు మాటలు పెక్కై
యొదవినను లెస్స; యటుగా
కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్. 59

క. చెలిమియుఁ, బగయును, దెలివియు,
గలఁకయు, ధర్మంబుఁ బాపగతియును, బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుబడిన; కాన పొసఁగఁ బలుకఁగవలయున్. 60

క. బెడిదముగఁ-గత్తి గొడ్డటఁ
బొడువఁ దెగినమ్రానఁ జిగురు వొడముఁ; బలుకులం
జెడఁ దునిసిన కార్యంబు ని
గుడ నేరదు పిదప నెట్టుఁ, గురువంశనిధీ ! 61

క. తనువున విఱిగినయలుఁగుల
ననువునఁ బుచ్చంగ వచ్చు, నతినిష్ఠురతన్
మనమున నాఁటిన మాటలు
విను మెన్నియుపాయములను వెడలునె యధిపా. 62

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడుప
ల్కొక్కఁడు లేదు; నీ కొడుకు లొండొరు మీఱి నికృష్టవాక్యముల్
పెక్కులు పెక్కుభంగులను బ్రేలుచునుండఁగ, నీవు దానికిన్
ద్రుక్కక వించు నుండె; దనురూపమె నీ కిది కౌరవేశ్వరా. 63

ఆ. చేటుకాల మైనఁ, జెట్టమాటలు-నెఱి
గాని తెరువు వట్టుకర్జములును
దగినయట్ల తోఁచుఁ; దగియెడునవి యవి
నీతు లని మనంబు నిశ్చయించు. 64

వ. నీబుద్ధి పాండవులతోడి విరోధంబు నెడ మరలంబడమి పాపం; బింతియు
కాక యేమి సేయుదము; మనకులంబునం దెజోధైర్యధార్మికత్వాది

గుణంబుల గరిష్ఠుం డయిన యుధిష్ఠిరుండు నీసిరికి వెలియై యట్లుండుట దగవగునే? నీ పెద్దతనంబు సూచి సైరణ వాటించి యున్నవాఁ'' డనిన, విదురుదిక్కు మొగంబై ధృతరాష్ట్రుండు "నీచెప్పిన నీతివాక్యంబుల నామనంబు దనివోవ, దింకను జెప్పు మనవుడు నతండు వెండియు నిట్లనియె. 65

ఆ. సకలపుణ్యకర్మచయమును నొక్క దెస
వినుము పాడి దప్పకునికి యొక్క
దిక్కు దీని శ్రుతులు తెలిపెదునెడఁ బాడి
కలిమి యెందుఁ బెద్దగా నుతించె. 66

తే. పాడి గలిగిన నిహలోకఫలము లెల్లఁ
జేరుటయ కాదు, కీర్తియుఁ జెందుఁ బురుషు;
ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరగు, నంత
కాలమును బుణ్యలోకంబు గల్గు నండ్రు. 67

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును, దనకొడుకు విరోచనుండును నంగీరసుం డనువిప్రుకొడుకు సుధన్వుండును సమతమ ప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్క ధర్మసందేహంబునకుఁ బన్నిదంబు పఱచి వచ్చి తన్నడిగిన, 'నితండు గొడు కితండు లాఁతి' యని తలంపక, మధ్యస్థుండై సుధన్వుం గెలిపించి యతనిచేత నిజతనయుని జీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రతికించెం; గావున నీవును ధర్మంబు విడువక, యధర్మోపేతు లైన నీ కొడుకులవలని పక్షపాతంబు విడిచి, తెఱంగు సేయుము; వారును నాపద లేక బ్రతుకుదురు, నీకును శోకంబు లేక తక్కు'' నని చెప్పి మఱియును. 68

క. "పాపంబులు గర్జము లని
యేపునఁ జేయంగ, నవియు నింపగు; ధర్మ
వ్యాపారంబు లకార్యము
లై, పరిణతిఁ బొందెనేని నట్టుల చెల్లున్. 69

చ. అది సభయే-ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని, నార్యులే-
మదిఁ దలఁపంగ వారలు సమంచితధర్మము వల్కరేని, న
ట్టిదియును ధర్మమే- తగ ఘటించిన నిక్కము లేదయేనిఁ, దాఁ
బదిలపు నిక్కమే-యొకనెపం బిడు చొప్పగునేని, భూవరా! 70

ఉ. నీతిపథంబునన్ బ్రదుకనేర్చుట యుత్తమభంగి, శౌర్యసం
జాతము లై కరం బలరుసంపద లొందుట మధ్యవృత్తి, య
స్ఫీతము లైన భారవహజీవనముల్ దలఁపం గనిష్ఠముల్,
నీతికిఁ బాహ్యు లైన- ధరణీవర మెత్తురె వారి నుత్తముల్; 71

ఆ. కయ్యమునక యెపుడుఁ గాలుద్రవ్వుదురు నీ
పుత్రు లెల్ల, సూతపుత్రుఁ డాది
యగు తదీయమంత్రు లంతకు ముందర
బిరుదు; లీవు నీతితెరువు సొరవు. 72

క. పాండవులు శౌర్య మొల్ల; ర
ఖండితనీతిప్రకారకార్యము మెచ్చై
యుండుదు; రెదు రేచినఁ- దుది
మండుదు; రార్పంగరాదు మఱి యెవ్వరికిన్. 73

క. తమతండ్రిభంగి నీకును
సముచిత మగు భక్తి సేసి, సజ్జనసమ్మతమా
ర్గమున నడచువారల, నీ
వమలమతిం గన్నకొడుకుల ట్లరయఁ దగున్." 74

వ. అని పలికి మఱియు నిట్లనియె. 75

క. కారణము లేకయును, నుప
కారపరత్వమున, నొరులకార్యంబులకున్
వారనియలజడిఁ బడియెడు
వారల చూ యెడుగడయు వారికి నధిపా! 76

చ. ఒకరుని చేతిప్రోవును దదున్నతిప్రాపును గాంచి, యెల్ల వెం
టకును గొఱంత లేక, పొగడం దగుసంపద నొంది. యట్టి దా
తకుఁ దుదిఁ గీడు సేసిన కృతఘ్నునిపీనుఁగు నైన, రోఁత పు
ట్టక కబళింపఁ- గుక్కలు నొడంబడునే? కురువంశవర్ధనా! 77

వ. కావునఁ గృతము దలంపమి గీడు; పాండురాజు నీకుం బరమభక్తుండు,
పాండవులునుం దేజోలాభంబులు గాంచినవారలు, వారల నాదరింపు”
మని చెప్పి వెండియు నిట్లనియె. 78

ఆ. “బ్రదుకు చేటు, పొగడు వడుట దూఱొందుట,
యాఁగి వేఁడుకొనుట, యిట్లు మఱియుఁ
గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి;
వాని కింత యేల వగవ నధిప! 79

క. వగ బలము దఱుఁగు, రూపఱు,
వగచిన మతి దప్పుఁ, దెవులు వచ్చును, దూఱన్
వగచి నలంగినఁ- బ్రియ మగుఁ
బగతురకును; వగచు టుడుగు పార్థివముఖ్యా!” 80

వ. అనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 81

క. “రిత్తయుపచారముల- నే
నుత్తముఁ డగు ధర్మతనయు నుడికించితి; దు
ర్వృత్తు లగు మత్సుతులకును
మిత్తి యగుం బోర; వగలు మిగులకయున్నే. 82

వ. నెవ్వగలు నివ్వటిల్లనీక నిలుపు నట్టిది యెయ్యది, దాని నెఱింగింపు”
మనిన విదురుం డిట్లనియె. 83

తే. “నియతతపమును, నింద్రియనిగ్రహంబు,
భూరివిద్యయు శాంతికిఁ గారణములు;
వాని యన్నింటికంటె మేలైన శాంతి
కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర!” 84

వ. అని [illegible]. 85

క. "జ్ఞాతుల పూరితమును, గో
బ్రాహ్మణ నాశ్రమమును, విప్రవర్గము ననవున్
నాతుల కాచించుటయును
ప్రీతిం జన నిచ్చు నతని వెం పొప్పు నృపా !" 86

క. అలమికొని, యొండొరుల ప్రో
వులఁ బ్రాపుల నెలమి కలిమిఁ బొందె, బహుజా
తులు నెమ్మిఁ గూడి, తామర
కొలని శ్రియన్ శిశిఁ బట్టగుదు రుజ్జ్వలులై. 87

చ. కరితురగాదిఘట్టనయు, గాలియు, నోంపదె యొంటి నున్న య
త్తరువు; ననేకభూరుహవితానము గుంపయి చేర్చి, బాధలం
బొరయునె? యన్నదమ్ములును బొందిన నేరికసాధ్యు లట్లుగా,
వెర వయి నిల్చినం—గలని కెల్లిద మై, పజీవోదు రెంతయున్ ! 88

వ. కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై పొదలిన, నెదిరికి నజయ్యు లగుదురు; పరులయొత్తు లేని రాజ్యంబు పూజ్య మహిమం బరగు; వనవాసంబునం గుందిన కౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట నీ కొడుకులకు నిలుపు గావించుట యగు" నని చెప్పి, మఱియు నిట్లనుఁ. "ప్రియవాదు లెందును గల, రప్రియం బగుంగా కేమి యని తథ్యంబు వలుకువారు లేరు; జూదంబు నప్పు నడ్డపడి యప్రియం బగుటకు శంకింప తథ్యంబు వలికితి; నది నీకు రుచియింపక, రోగికిఁ బథ్యాహారం దల కంటగించున ట్లయ్యె; నైన నిప్పుడుం జెప్పెద వినుము; కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున, మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయు చందంబున సుయోధనాదులం బట్టి యుధిష్ఠిర ప్రముఖుల విడిచితి: నేఁడు కార్యంబు ముట్టవచ్చినం దోఁపక మిడుం గుఱు పోఁకినట్లు దల్లడించెదవు; కులంబునకై యొకనిం దొఱంగుటయ నీతి యని పెద్దలు సెప్పుదురు; దుర్ణయపరుండై సద్బుద్ధి సెప్ప వినండేని

మనము దుర్యోధనుం దొఱంగిన నేమి యగు ? నది యట్లుండె. సంపద సహాయంబు నపేక్షించియుండు; సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లు; నిట్లివి యొకటొకటి పొందునం గాని సిద్ధింపవు; గావున నీ సంపద పాండవులకును, వారి సహాయత్వంబు నీకునుం బ్రియం బొనరింప, నొండొరుల కలయుట మేలుకాక, మనలావు వెలిసేయుట లెస్సయగునే? కురువంశనిస్తారకు లగు భీష్మయుధిష్ఠిరులును, నవక్రవిక్రము లగు కర్ణార్జునులును, బ్రతాపధాములగు భీమదుర్యోధనులును, శస్త్రాస్త్ర పారగులగు నభిమన్యు లక్ష్మణ ప్రభృతి కుమారులును, శాపానుగ్రహ సమర్థులగు ద్రోణద్రుపదాది పరమాప్తులును వారివారి బంధుమిత్త్రి జనంబులును నొక్క-మొగంబై, నీ పనుపుసేయుచు, నయవిక్రమంబు లప్రతిహతంబులై నడవం, బృథివి శాసింప భవదీయవిభవం బుజ్జ్వలంబై, యొరుల కెడలేక చెల్లుచున్న నెంత యొప్పగునో యటు విచారింపుము; పాండవులు ధీరమతులై వైర మెత్తక యూరక తొలంగి యుండి రేనియుఁ, గతిపయదినంబులలోఁ జీకాకుపడి చెడుం గాక గాంధారీ నందనుచేత వసుంధరాపరిపాలనభారంబు నిర్వహింపఁబడునే'' యనిన, విని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 89

తే. నీవు సెప్పిన మాటలు నిర్మలములు -
నిపుణసమ్మతములు - రాజనీతిమార్గ
బోధకంబులు నైనను, బుత్త్రు విడువ
నోప; 'ధర్మో జయతి' యని యుండువాఁడ.'' 90

వ. అనిన విని విదురుం డతని కిట్లనియె ''దేవా ! జ్ఞాతులు గుణహీను లైనను విడువం దగ దనిన, సకలగుణసంపన్నులై భవత్ప్రసాదంబు గోరుచున్న కౌంతేయులన్ దిగవిడువం దగునే? యేను నీకు హితంబు గోరెడు వాఁడ నని నిశ్చయించి నా బుద్ధి వినుము; వారల జీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియ లైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి తెఱంగు పఱచిన లెస్స యని చూచెద; 'నతని విడువ వలయు' నని చెప్పితినే నీ వెనుకవ్వం బశ్చాత్తాపంబు పుట్టు; దాని కప్పుడు ప్రతీకారంబు లేదు;

కావున నెల్లభంగుల నియ్యకొని పాండవులతోడ సంధి సేయవలయు;
నట్లుంగాక. 91

క. తమలోని పాళ్ళకుంగా
సమరము సేసినను గాని చాఁ జనదె? శరీ
రము లాధివ్యాధిజరా
సమన్వితము లగుటఁ, జేటు సహజం బరయన్; 92

చ. గజతురగాది సంపదలుఁ, గాంతలతోడి విహారలీలలుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేయు క్రమంబుఁ, బోరులన్
విజయముఁ బొంది పేర్చుటయు, విస్ఫురితాభరణానులేప వ
స్త్రజనిత వైభవంబుఁ గలరాజులుఁ- బోయిర కాక నిల్చిరే? 93

క. కావునఁ, జెవికిం జేఁదగు
నీవాక్యము వినఁగఁ జాలితేని, నిహపర
శ్రీవిభవములకుఁ గీర్తికిఁ
దావలమై, వెలయు టింత తథ్యము సుమ్మీ! 94

క. తగ నీలో నూహింపుము,
దిగవిడువకు ధర్మతనయు; ధృఢమతివై పొం
దగు చందము గొడుకులకుం
బెగడలకుం జెప్పి తీర్పు-పెంపేర్పడఁగన్." 95

ఆ. అనిన నాంబికేయుఁ డను, "నీదుపలుకులఁ
గలఁక దేఱి బుద్ధి దెలివి నొందె;
నిట్ల చేయువాఁడ; నిదియ కర్జము ధర్మ
మును యశంబు లాభమును దలంప." 96

చ. అనుఁడు, ముదంబు నమ్మమియు నాత్మఁ బెనంగొన, నన్నతోడ ని
ట్లను విదురుండు- "పెద్దవడి కక్కట! నీమది కార్యవృత్తి నూ
ల్కొనియె; సుయోధనుం గని యకుంఠిత నిశ్చయమై యతండు వ్రా
లిన దెస వ్రాల కుండిన, బళే! మముబోటులకుం బ్రియం బగున్." 97

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి. 98

క. దైవంబ నేర్పుఁగా, 'కిటు
వోవఁగ నే నేర్తు-నేరఁ బో'మ్మని పలుకం
గా వశమె; నరున కెక్కుడు
దైవము పౌరుషముకంటెఁ; ధరణీనాథా! 99

వ. అని విదురునకు వైచిత్రవీర్యుం డిట్లనియె. 100

తే. "ధర్మపథమును నీతితత్త్వంబు తెరువు
నిర్మలము లగు పలుకుల నీవు నాకుఁ
దెలియఁజెప్పితి; పరమార్థదృష్టి యెట్టి
వాక్యములఁ గల్గుఁ జెప్పుము వాని ననఘ!" 101

-: సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబుఁ జెప్పుట :-
సం. 5-41-2.

వ. అని యడిగిన విదురుం డతని కిట్లనియె, నాకుఁ దోఁచిన యన్నియు నానేర్చినట్లు నీ కెఱింగించితి; నత్యంతగుహ్యంబు లగు నర్థంబులు పురాణుం డయ్యునుం గుమారుం డగు సనత్సుజాతుండు దెలుప నోపుం; గాని యిటమీఁద నాకుం దెలియ" దనిన, ధృతరాష్ట్రుం "డమ్మునీంద్రుండు నా కెంతదవ్వు, నీవ యవియునుం జెప్పు" మనిన, నేను శూద్రయోని జాతుండ, వేదాంతవేద్యంబు లగు నర్థంబులు నా కగోచరంబు, లమ్మహాత్ముబుద్ధి నే నెఱుంగుదు, దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు, నతండు దెలుపంజాలు ననిన ధృతరాష్ట్రుం డతికుతూహలుండై. 102

ఆ. "మనకు నిప్పు డతనిఁ గనుతెఱం గెయ్యది
యగుటయును నెఱుంగ" ననిన, విదురుఁ
డధికశక్తిఁ దలఁచె నాత్మలో నాశ్రిత
వత్సలత్వనిధి సనత్సుజాతు." 103

వ. అట్లు దలంచుటయును, దివ్యజ్ఞానమాననీయుం డగు నమ్మునివరేణ్యుం డాక్షణంబ పొడసూపిన, విదురుం డతనివచ్చుట యుగ్గడించుచు వినయంబున నతని నెదుర్కొని దండనమస్కారంబు లాచరించి, యున్నతాసనం బిడి యర్ఘ్యపాద్యంబు లిచ్చి, ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబునుం జేసియున్న ధృతరాష్ట్రు నతనికిం జూపి, విదురుం డిట్లనియె. 104

క. "దేవా! దేవరకృప నీ
భూవల్లభుఁ డమలతత్త్వబోధకమై సౌ
ఖ్యావహ మగువాక్యచయముఁ
దా వినఁగోరుటయు, మిమ్ముఁ దలఁచితి భక్తిన్!" 105

వ. మీరును గారుణ్యాతిశయంబున విజయంచేసితిరి; గురుసమాశ్రితు లగు వార లెద్దానివలన సుఖదుఃఖంబులు, లాభాలాభంబులుఁ, బ్రియద్వేషంబులు నాదిగాఁగల ద్వద్వంబులం బడక బ్రదుకుదు రట్టి పరమార్థోపదేశంబున నితనిం గృతార్థునిం గావించి రక్షింపవలయు" నని ప్రార్థించినం, బార్థివుండును దదనురూపంబు లగు నాలాపంబుల నారాధించినం, బ్రసన్నుండై సనత్సుజాతుం డధ్యాత్మవిషయంబు లగు వివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంతకంతకు సూక్ష్మంబు లగు నర్థంబులు సమర్థించుచు, నందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివరించుచు, హృదయపుష్కర కలితంబగు పరతత్త్వంబు ప్రసాదించునట్టి గూఢోక్తులను గ్రహించుచుండ, నెట్టకేలకుఁ బ్రభాతం బగుటయు, ధృతరాష్ట్ర విదురుల నామంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధానంబు నొందె; నట్టి సమయంబున. 106

—: ప్రాతఃకాల వర్ణనము :—

(అమూలకము)

తే. తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు-
లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట

కుమ్మలించి, వివర్ణత నొందినట్లు
గంది, యెంతయుఁ జెలు వేదెఁ జందురుండు. 107

క. కుముదములుఁ దారు నొక్కటఁ
బ్రమదంబున నుండి, వాని పదవి దొలఁగినం
దమకుఁ నిలువఁగఁ దగ దను
క్రమమునఁ జనునట్లు, తారకంబులు విరిసెన్. 108

ఉ. ఎత్తిన వేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు సాఁచి, చూడ్కులం
జిత్తములఁ నిగిడ్చి, తమ చెందెదు నిక్కలు రోసి, యింపు ద
ళ్కొత్తగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి, యెలర్చు కాయ్వులం
జిత్తజుకేళిఁ దేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్. 109

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటు ల
ల్లిన యోలిఁ వెదలంగ, రేకులు సముల్లాసంబునఁ బింకమె
క్క, నయం బెక్కుచు గ్రద్దె పొందెదలి పీఁకం గేసరంబుల్ గడ
ల్కొనఁ, దోడ్తో మధు వుచ్చి పేరెలమిఁ బొల్పుం జెందె నంభోజముల్.

చ. వెడవెడ నిద్ర వొంది, కను విచ్చిన పాంథులమీఁద దాడివోఁ
దడఁబడ నొండొరుం బిలుచు దర్పకు పంపు బలంబులోని య
ల్కకరణిం, జెలంగె శుకకోకిలభృంగతతుల్ వనంబులం-
దెడనెడఁ బల్కఁ గూయ సొగియింపఁగ మ్రోయఁగఁ- దద్విరావముల్.

సీ. పద్మపరాగంబుఁ బరగించు నరుణోద
యంబుకాంతికిఁ జెలువంబు మిగులఁ,
బరువంబు దప్పిన విరుల రాలుచుఁ దరు
చయము చుక్కలు లేని చదలఁ జెనయ,
నరవిరినెత్తావి నడరించు నున్నిద్ర
విటపీటిసౌరభవితతి వొదల,
నెలఁత చీఱిన యెఱకల నెఱిఁ దీర్చు జ
క్కవలు చందోయి కేఁకట యొనర్ప,

ఆ. వెలరువాలు దివియల నల్ల నల్లార్చు
సోర్ణగండ్లయందుఁ జొచ్చి సుడిసి
తిరిగి వేగుఁబోక తెమ్మెర లెలదీఁగ
కొనలవంక లొత్తు; ననలఁ బ్రోచు. 112

ఆ. అంత నుదయశైల మను నశోకద్రుమ
సమితియందుఁ గాంతి చారుభంగి
నెఱయ విరిసి తొలుత నెగసిన యుజ్జ్వల
స్తబక మనఁగఁ బద్మసఖుఁడు పొడిచె. 113

సీ. ఉర్వీధరంబుల నొప్పెడు జేవుఱుఁ
జఱుల కాంతికి నునుమెఱుఁగు వెట్టి,
ధరణీజగుల్మలతావితానము పల్ల
వములకుఁ గట్టెఱ్ఱవన్నె యొసఁగి,
యరుణాంబుజంబుల యంతర్దళంబుల
తళతళలకు జిగి దళము కొల్పి,
చక్రవాకద్వయసంతతి యొఱకల
గోమరారు కెంజాయఁ గ్రొత్త సేసి,

ఆ. తనదు బాలబింబ మనుపమేయప్రభా
పటలజటిలగగనభాగ మగుచు
నుల్లసిల్లి, జగము లెల్లను విలసిల్లఁ
బూర్వశిఖరిమీఁదఁ బొడిచె నినుఁడు. 114

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు, ధృతరాష్ట్రుండు దత్కాలోచితాచారంబులు నిర్వర్తించి, తగు తెఱంగున నలంకృతుం డయి యాస్థానమండపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ, గుంభసంభవకృపకృతవర్మాశ్వత్థామకర్ణాదు లగు దొరలును భీష్మ విదుర బాహ్లిక సోమదత్త భూరిశ్రవః ప్రభృతు లగు బంధుజనులును, దుర్యోధన దుశ్శాసన ప్రముఖు లగు కుమారులును లోనుగాఁ గల సమస్తపరిజనంబులును వచ్చి బలసి యుండ; నయ్యవసరంబున సంజయుఁడు వచ్చి వాకిట నిలిచి పడిహారుల

వలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి సముచితప్రదేశంబునఁ గూర్చుండి, తనమాటలు వినుటకుఁ జిడిముడిపడుచున్న కొలువుఁ గలయం గనుంగొని యిట్లనియె. 115

-: సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు సెప్పుట :-

సం. 5-48-15. (5-58-8)

తే. "పాండురాజతనూజుల పాలి కర్థి
నిమ్మహారాజు పనుపంగ నేఁగి ధర్మ
పుత్త్రుఁ గాంచితి; నాతండు మైత్త్రి మెఱయఁ
గౌరవులసేమ మెల్లఁ జేర్చెర నడిగె. 116

వ. మఱియుం దగువారలనెల్ల నయ్యయ్యుచితవిధిం బ్రణామంబున వినయంబున బాంధవంబున మిత్త్రభావంబున వాత్సల్యంబునఁ బ్రసాదంబున నాదరించె; నేనును భూనాథుండు గఱపినతెఱంగున గొంతలేకుండ బంధుత్వంబునకు వలయు మాటలాడితిఁ; బదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లింత యొప్పునే" యని యగ్గించిన, ధృతరాష్ట్రుం డవహితుం డై యడుగఁ దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పిన భంగులు, నతండు వానికెల్ల నుత్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి, ధృతరాష్ట్రునకుం బితామహునకు దుర్యోధనునకుం గ్రమంబున వారివారితో నాడు మని నియమించిన చందంబులు ధర్మనందను పలుకుల పరిపాటిం దేటపడం జెప్పి, సూతసూనుండు వెండియు నిట్లనియె. 117

తే. "ఏ నుపప్లావ్యపురమున కేఁగి తొలుత
వాసుదేవార్జునులఁ గంటి, వారు నీతి
పథము దప్పనిమాటలు బలిమిఁ దోఁచు
నట్లుగా నాడి- రవి వినుం డాదరించి." 118

వ. అనిన విని ధృతరాష్ట్రుం "డవ్వాసుదేవుచిత్తం బె, ట్లతం డేమనియె" నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె. 119

ఉ. "తానును సత్యభామయును ద్రౌపదియున్ నరుఁడున్ రహస్యగో
ష్ఠీనిరతాత్ముఁ డై, సుతులుఁ జేరని చెందని యట్టిచోటఁ, గాం
తానివహంబు గొల్వఁ బ్రమదస్థితి నుండియుఁ బిల్వఁ బంచె న
న్నానలినోదరుండు; హృదయంబున నీదెస కూర్మి యెట్టిదో!" 120

వ. ఏనును దత్ప్రకారంబు పరిహారులవలన మున్న యెఱింగిన వాఁడ నగుటం జేసి, కంచుకంబును శిరోవేష్టనంబును ధరియించి వినీతవేషుండ నై పోవునప్పుడు, కృష్ణార్జును లనేకమణిమయభూషణప్రభాభాసితు లై యొక్కసెజ్జ యున్నవారు, కృష్ణుండు పవ్వళించియుండి చాఁచిన చరణంబులు దొడలపై నిడికొని యర్జునుండు గూర్చున్నవాఁడు, సత్య భామయుం బాంచాలియు గద్దియలపై నున్నవారు, సవినయంబుగా నేనును దండప్రణామంబు సేసిన, న న్నాదరించి కృష్ణుని చేసన్న నర్జును పనుపునం గనకరత్నమయం బగు నతని పాదపీఠం బతండు ద్రేల్చిన కాళ్ళు దిగిచికొనిన, నిద్దఱు ముద్దియ లెత్తి తెచ్చి నాకుం బెట్టిన, నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి కేలు మొగిడ్చి ఫాలతలంబున గదియించి, నీలవర్ణులు బాహుబలమదభరితులును నయి యేనుఁగుదోయియుం బోలె నున్న యమ్మాధవ ధనంజయులఁ జూచు నప్పుడు నాకు హర్షాశ్రుపులకలును దదనంతరంబ భయంబునుం బుట్టె; నట్టియెడ. 121

క. ఈ యిరువురుఁ బంచినపని
సేయుదు రట- ధర్మజునకుఁ జేకుఱనితలం
పేయది! యతనిం దొడరుట
వేయేటికి జమునిశిరము ద్రేయుట గాదే. 122

వ. అని తలంచుచుండ, నమ్మహానుభావులు నన్ను సంభావించి తా రుపయో గించునట్టి యన్నపానంబులను దమకుఁ గట్టఁ దగినట్టి వస్త్రంబులను దాము దొడఁగునట్టి భూషణంబులను నాకుఁ బ్రియం బొనర్చి గారవిం చిన, నేనును నా పోయిన కార్యంబు విన్నవించిన, విజయుండు బలు మొగంబుతో దానికి నుత్తరంబు వలుకం దొడంగిన వారించి వారిజో దరుం డిట్లనియె. 123

-: సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుండు చెప్పిన మాట
లెఱింగించుట :-

సం. 5-58-18.

తే. "వినుము సంజయ! ధృతరాష్ట్రవిభుని పెద్ద
కొలువునందుఁ దత్పుత్రులు గురుఁడు కృపుఁడు
నాపగానందనుఁడు మొదలైన సకల
జనులు వినుచుండఁగా నిట్టు లనుము నీవు. 124

ఆ. అయ్యజాతశత్రుఁ డలుగుట- నీళ్లుల
నగ్ని పుట్టినట్టి దయ్యె; మీకు
నార్ప వెరవు లేదు, నేర్పుమై నింకఁ గా
వింపవలయు పనులు వినుఁడు మీరు. 125

వ. అవి యెవ్వి యంటేని. 126

సీ. కలయట్టి వివిధార్థములు నశేషంబుగఁ
దగ నొసంగుండు సత్పాత్రములకుఁ,
జెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి
సత్కరింపుఁడు సంతసం బెలర్ప,
నిచ్ఛానుగుణముల నింద్రియసుఖముల
ననుభవింపుఁడు హృదయంబు లలర,
నాండ్రను బిడ్డల నయ్యైవిధంబుల
గారవింపుఁడు ప్రియపూరితముగ,

తే. మఱియు నెవ్వరిచిత్త మెత్తెఱఁగునందు
వాటమై యుండు నదియెల్ల వలయునట్లు
చేసి విహరింపుఁ; డిం కెడ సేయ కనికి
నడవుఁ డఱచేతఁ బ్రాణంబు లిడి కడంగి." 127

వ. అని చెప్పు మింత యేమిటికంటేని, 128

ఉ. ఎందును నెవ్వరుం బడని యెంతయుఁ గష్టముపాటు వచ్చినం,
గొందల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్న నన్ను 'గో
విందుఁడ కావు' మంచుఁ బలవించుట యీఁగఁగరాని యప్పుఁ బో
లెం దలపోయ వేఁగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్. 129

తే. ఇట్టి యేఁ దేరు గడపంగ, నెందు నుతికి
నెక్కు గాండీవ మేత్తెఱ నెక్కువెట్టి,
రెండు దొనలును బూని కిరీటి యనికి
వచ్చు నేఁడెల్లి; యెందుఁ బోవచ్చు మీకు ? 130

వ. అని పలుకునప్పటి వారియెత్తుకోలును నీ కొడుకు విడుపోవమియునుం దలంచి భయంబందితి; నితండు వారల నెఱుంగండు, భీష్మ ద్రోణుల ప్రాపును గర్ణుగర్వంబును దన్ను గెలిపించు నని నచ్చి తొడరెడు" ననిన విని ధృతరాష్ట్రుం 'డర్జునుం డేమనియె' నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె. 131

*-; సంజయుఁడు ధృతరాష్ట్రునకు అర్జునుఁడు చెప్పిన మాట*
*తెలియంగించుట :-*

సం. 5-47-6.

క. "నరుఁ డలుక వొడమియును సు
స్థిరుఁడై, తన యెఱ్ఱనెరల చెలువునఁ గెందా
మరలం దెగడెడు కన్నుల
నరుణచ్ఛవి నెఱయ, నిట్లు లనియె నరేంద్రా ! 132

ఆ. ఆ సుయోధనుండు, నతనికిఁ తోడ్పడ
నరుగుదెంచినట్టి ధరణినాథ
చయము వినుచునుండ సంజయ ! నా వచ
నములు గాఁగ నీ వనంగ వలయు. 133

ఉ. పాండునియగ్రనందనుఁడు పో లడుగం దగ నీఁడ యేని, మా
కొం డన నేల మే లది; సుయోధనుఁ డింతకు మున్న పెక్కు లు

ద్దండతఁ దారు జేసినవిధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన
ట్లుండెడుఁ గాక- యేనును వృకోదరుఁడుం బ్రియ మందునట్లుగన్. 134

క. మా యిరువురతోఁ గయ్యము
సేయ నతం డియ్యకొనిన, సిద్ధించెన కా
దే యుచితచరితుఁ డగు కౌం
తేయాగ్రజు కార్య; మట్టి తెఱఁ గొప్పుఁ గదా. 135

క. వనవాసంబున భూశ
య్యను ధర్మజుఁ డున్నయట్టి యాయాసము వో
వునె- యంపకయ్య దుర్యో
ధనుఁడు రణక్షోణిఁ బడక తక్కిన యేనిన్ ? 136

ఉ. సూనృత మూఁది, బన్నములు సూడక లోన నడంచినట్టి కో
పానల- మెండియున్న నిబిడాటవిపైఁ బచరించు తీవ్రదా
వానలుఁ బోలి, శాత్రవచయంబుపయిం గవియించి నిల్చినం
గాని, యుధిష్ఠిరున్ సరకుగాఁ గొన రా ధృతరాష్ట్రనందనుల్ ! 137

మ. గద సారించుచు, నంత్యకాలవిచలత్కాలాకృతిన్ భీముఁ డు
న్మదమాతంగచయంబు నుగ్గుగ, లసన్నానారథవ్రాతముల్
చదియన్, భూరిహయవ్రజంబు పొడిగా సంరంభతుంగాంగుఁ డై
కదియం జూచి, బలే! సుయోధనుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్.

సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్లకు
నులుకు తెఱంగునఁ దఱియఁ జొచ్చి,
పెనుగాలి జీమూతబృందంబుపై బెట్టి
దంబుగ వీఁచుచందమున నడరి,
కనిమసంగినమారి గడఁగి జీవులమీఁద
నుగ్రతఁ గవియున ట్లురవడించి,

యాఁకొన్న లయరుద్రుఁ డాగ్రహంబున జగ
త్ప్రళయంబు ముట్టెడుభంగిఁ బొదివి,

తే. నకులుఁడును, దదనుజుఁడు, సాత్యకియు, నాసు
భద్రకొడుకును- నెదిరిన బలము నెల్ల
బెదరఁ బెదర బడల్పడఁ బెల్లుసావఁ
జేయఁ గని కౌరవులు సంధి సేయువారు. 139

ఉ. చిత్తము లుల్లసిల్ల, నల సింహకిశోరము లొక్కమై మదో
న్మత్తగజావళిం బొదువు మాడ్కి నరాతిబలంబు ముట్టి, యు
ద్వృత్తిఁ గడంగి, యప్రతిమవీరులు ద్రౌపదిపుత్రు లేవురున్
నెత్తురునీరఁ దేల్చిన, ననిం గని మీనృపుఁ డల్క దీఱెడిన్. 140

మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహాజిం బ్రాణముల్ డాఁప కు
జ్జ్వలులై తో నడవన్, విరాటుఁడును బాంచాలుండు నేపారి సే
నల యుద్రేకము రౌద్రముం బెనుప, నానాహేతిఘోరంబుగాఁ
దలపడ్డం గని గాక, ప్రుక్కుదురె గాంధారిసుతుల్ మాటలన్. 141

చ. తఱిమి శిఖండి దన్నొరులు దాఁకఁగ, నెవ్వరి దిక్కుజూడ కే
త్తెఱఁ దనపూన్కిపై మనము ధీరత నిల్చి, రథంబు బల్విడిం
బఱచి, కురుక్షితీశుఁ డను బ్రహ్మకు వేయును నిండ, భీష్ముపై
కుఱికినఁ గాక, మాకు నగ మూరక యిత్తురె మీరు మేదినిన్. 142

శా. విద్యుద్దండము నిల్చి పోల్చినగతిం గావిల్లందమై యుండ, న
స్మద్యోధావలిమానసంబున రణోత్సాహంబు రెట్టింప, ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి కా,
కుద్యోగించుట కేల తక్కుదురు మీ రుగ్రాహవక్రీడకున్. 143

సీ. గాండీవగుణరవం బొండొండ చెలఁగంగ,
శరపరంపర లాకసంబు గప్పఁ,
ప్రతివిశిఖములు ఖండితములై రాలంగ,
నెదిరిసైన్యంబుల మదగజాది

చతురంగములును జర్జరితంబులై యవ
యవభేద మెఱుఁగని యట్లు గాఁగఁ,
దునిసిన, నెత్తురు నెనడును నెమ్ములు
నెఱచియుఁ గండలు నెనసి, సమర

తే. తలము ఘోరంబుగాఁ, గపిధ్వజము ధవళ
హయులు శోభిల్ల, నొగలపై హరి యెలర్ప,
దేవదత్తంబు మ్రోయఁ దోఁతెంచునట్టి
రథముఁ గని కాని కానఁడు రాజరాజు. 144

శా. బాలక్రీడ మహాసురప్రకరముల్ భంజింపఁడే, యెప్పుడుం
ద్రైలోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపదే, యట్టి శౌ
ర్యాలంకారు మహాత్ముఁ డా సరకుసేయం డచ్యుతుల్; మ మ్మతం
డేలా కైకొను; నాసుయోధనునియం దెగ్గేది యూహింపఁగన్. 145

వ. ఏము పితామహ గురు కృపాచార్యులకు నమస్కరించి యస్మదీయ రాజ్యభాగంబునకై తొడరి కయ్యంబు సేయువారము, కౌరవులకుం బాని యెవ్వరు మాతోఁ బెనంగినను వారి శస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబు లగు నని తలంచెదము; పండ్రెండువత్సరంబులు వనంబున నమ్మెయి నిడుములం బడి, జనపదంబునం బదుమూఁడగునేఁ డజ్ఞాతవాసాయాసం బట్లనుభవించి వచ్చి, మా తండ్రి పాలికై పెనంగుమమ్ము నింద్రాదిసురసహాయులయ్యును ధార్తరాష్ట్రులు గెల్వువారై రేని ధర్మంబుకంటె నధర్మము బలవంతం బైనయది యగు; నింతియ కాని మాచేయునట్టిది గీడైనది గా; దేము వాసుదేవుని మున్నిడికొని నడుతుము గావున నీ యుద్ధంబునం జయంబు మాకు సిద్ధంబ; యెల్లభంగులం గర్ణసహితంబుగా గాంధారీనందనులం దునిమి యేము భూమి గొనుట దప్పదు; గాండీవంబు దివియకయును గుడుసువడియెడు బాణంబుల దమయంతన తూణీరంబుల వెడలెడుఁ; దోలూడ్చు మహానాగంబునుం బోలెఁ గరవాలంబు దాన యొఱవెలికి నిగుడుచున్నయది; గావున మా కవశ్యంబును సంగరంబు సంభవించుఁ; బాశుపతాది దివ్యశరంబులం గురుపత్రప్రజాక్షయంబు సేసి శాంతిం బొందెదము; సూతనందనా!

నీవు స్థిరుండవై యింతయుఁ దెలియం బలుకవలయు; నిమ్మాటలు విని కురువృద్ధుం డగు బాహ్లికుండును బితామహుండగు భీష్ముండును గురుం డగు కుంభసంభవుండును శిక్షకుండగు కృపాచార్యుండును గురుపుత్త్రుం డగు నశ్వత్థామయు సద్బుద్ధియగు విదురుఁడును ధర్మాచరణకల్యుం డగు శల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది యయ్యెడు; సుయోధ నాదు లాయుష్మంతు లగువార కాక" యని పలికె నని చెప్పిన విని మందాకినీనందనుం డందఱు విన దుర్యోధనున కిట్లనియె. 146

సీ. "నలినగర్భుఁడు పెద్ద కొలువున నున్నెడ,
సురపతిప్రముఖుల చూడ్కు లెల్ల
మెఱయు తేజంబున మిఱుమిట్లుగొన,
నిద్ద ఱచ్చట నొరసికొం చరుగఁ జూచి
'వీ రెవ్వ, రిమ్మెయి మీ రుండ సరకునే
యని యట్లు వోయెడు నట్టివార'
లని బృహస్పతి బ్రహ్మ నడిగిన, నతని కి
ట్లనియె నా చతురాస్యుఁ డాదరమునఁ

తే. దపము పెంపును, బలశౌర్యదర్పములును
గలిగి, లోకహితార్థంబుగాఁ జరింతు,
రే యుగంబుల 'నరుఁడు నారాయణుండు'
ననఁ బ్రసిద్ధికి నెక్కిన మునులు సుమ్ము." 147

వ. అని పలికి వెండియు. 148

క. అనిమిషహితము, దనుజనా
శనమును జేయుదు; రధర్మసంగ్రామము గ
ల్గినచోట ధర్మపరు లగు
జనముల గెలిపింతు- రధికసంరంభమునన్. 149

వ. దేవాసురయుద్ధంబు నప్పు డింద్రుండు వోయి వీరి నారాధించి తోడడి
గినం జనుదెంచి, పౌలోమకాలకేయాదు లగు ననేకదైత్యదానవులం

